# అక్షరోద్యమం




రచన : అక్షరం ఉమామహేశ్

# అక్షరోద్యమం

**సత్యాన్వేషణే అక్షరోద్యమం- అజ్ఞానపు చీకట్ల పై ఉద్యమిస్తూ ఉదయించే సూర్యునికి, అక్షర విజ్ఞానము పంచాలని ఉద్యమించే అక్షర సాధకుని ఆత్మకు భేదం లేదు.**

## రచన
## అక్షరం ఉమామహేశ్




**అక్షర పద్మము**

రచయిత అక్షరముల పూర్తి స్వరూపాన్ని పరిశోధించి పరిశీలించిన తర్వాత ఆ వైజ్ఞానికతను అక్షర పద్మం అనే నమూనా రూపంలో నిర్మించడమైనది

ప్రథమ ప్రకాశం : జూన్ 2020 - శార్వరి గురు పూర్ణిమ
ప్రకాశకులు : అక్షరం ఉమామహేశ్
ప్రతులకు : అక్షరం ఉమామహేశ్
ముఖ చిత్రం మరియు టైటిల్ డిజైన్ : అక్షరం ఉమామహేశ్

**అక్షరోద్యమం ముఖ చిత్రం:** సత్యాన్వేషణే అక్షరోద్యమం- అజ్ఞానపు చీకట్ల పై ఉద్యమిస్తూ ఉదయించే సూర్యునికి, అక్షర విజ్ఞానము పంచాలని ఉద్యమించే అక్షర సాధకుని ఆత్మకు భేదం లేదు.

**అక్షర పద్మము గురించి :** రచయిత అక్షరముల పూర్తి స్వరూపాన్ని పరిశోధించి పరిశీలించిన తర్వాత ఆ వైజ్ఞానికతను అక్షర పద్మం అనే నమూనా రూపంలో నిర్మించడమైనది.. 2019©





9781716780271

Please, send your comments to AKSHARAM UMAMAHESH
Email: greaterindiaresearch@gmail.com

వెల : **అమూల్యము,** ప్రియమైన చదువరీ, నేను మిమ్మల్ని కోరేదల్లా మీరు ఈ అక్షరోద్యమం పుస్తకం ఆమూలాగ్రం చదివి అక్షర రహస్యాలు కూలంకషంగా తెలుసుకొని , అక్షరోద్యమంలో భాగంగా మరి తొమ్మిది మందికి అక్షర రహస్యాలు నేర్పండి. 'నవ' అంటే తొమ్మిది, అది ఎప్పుడూ కొత్తదే. కనుక మీరు నేరిపిన ప్రతి వ్యక్తీ మరో తొమ్మిది మందికి నేర్పమని కోరండి.

**అక్షరోద్యమము**

# ప్రియమైన చదువరీ, నేను మిమ్మల్ని కోరేదల్లా, ఈ అక్షరోద్యమం పుస్తకమును మీరు ఆమూలాగ్రమూ చదివి అక్షర రహస్యాలు కూలంకషంగా తెలుసుకొని , అక్షరోద్యమంలో భాగస్వాములై మరి తొమ్మిది మందికి అక్షర రహస్యాలు నేర్పండి. 'నవ' అంటే తొమ్మిది, అది ఎప్పుడూ కొత్తదే. కనుక మీవద్ద నేర్చుకున్న ప్రతి వ్యక్తీ మరో తొమ్మిది మందికి ఇలాగే ఈ అక్షరోద్యమం పుస్తకమును ఇచ్చి అక్షర రహస్యాలు నేర్పమని కోరండి.

**అక్షరం ఉమామహేశ్**

## అక్షరోద్యమము

ఈ "అక్షరోద్యమం" ప్రతి తెలుగు వ్యక్తి వాక్కులో హృదయంలో మస్తిష్కంలో, ప్రతి తెలుగు కుటుంబం ఇంటి లోగిలిలో , ప్రతి విద్యాసంస్థ ప్రాంగణంలో, ప్రతి సాహితీ వేదిక పైన నిరంతరం ఆవిష్కరించుకొనవలసిన అంశాలున్న గ్రంథము.

కనుక అక్షరోద్యమంలో భాగంగా అక్షరోద్యమం పుస్తకావిష్కరణ పుస్తక సమీక్ష పుస్తక వితరణ , అందులోని అంశాల ఉచిత బోధన మరలా మరలా జరగాల్సిన అంశాలు.

ప్రతి బడిలో ప్రతి తల్లి ఒడిలో తెలుగు వారు కలిసే ప్రతి చోటా నిరంతరం అక్షరోద్యమ ఆవిష్కరణలు జరగి అక్షరాలు మనందరిలో ఆత్మవిశ్వాసం నింపాలని ఆశిస్తూ, నా అక్షరోద్యమానికి ఆ అక్షరోద్యమ ప్రచార పరంపరకు ప్రోత్సాహకారులుగా నిలవాలని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

అక్షరం ఉమామహేశ్

# విషయ సూచిక



## అధ్యాయం 1 : మన అక్షరాలు



## అధ్యాయం 2 : భాషా వైవిధ్యత- అక్షరాలు

# అధ్యాయం 3 : భాషా మరణం



# అధ్యాయం 4 : అక్షరోద్యమము

## అనుబంధం 1: ఇంగ్లీష్ కీబోర్డ్ లో తెలుగు అక్షరములు

1. ఆంగ్ల కీబోర్డుల్లో నలుగుతున్న తెలుగు అక్షరాలు -పరిష్కారాలు
2. ఐ ఎస్ ఓ 15919 హార్వర్డ్ క్యోటో, ఐ ట్రాన్స్ పద్ధతులు

## అనుబంధం 2: అక్షర విజ్ఞానం

1. అక్షరమాల - సూత్రములు
2. అచ్చులు హల్లులు అనే పదాల పుట్టు పూర్వోత్తరాలు
3. శబ్ద శాస్త్రమునకు చెందిన సాంకేతిక పదాల వివరణలు
4. క చ ట త ప వర్గముల వెనుక రహస్యాలు
5. అనునాసికల పుట్టుక - వాడకంలో వాటి సహజత్వము
6. సంకీర్ణ అక్షరములు - అక్షర మాల విశ్వరూపం
7. మహా త్రిలింగ లిపి/పెను తెనుగు వ్రాలు పట్టిక
8. సంహిత-సంయోగము- సంధి
9. గుణింతాలలో గణితము

## అనుబంధం 3 : అక్షర అభ్యాసాలు

1. స్థానము- కరణము - క చ, ట, త ,ప వర్గముల సాధనాభ్యాసములు
2. అభ్యంతర ప్రయత్నము - సాధనాభ్యాసములు
   2.1. సంవృత ,వివృతముల సాధనాభ్యాసములు
   2.2. స్పర్శలు- సాధనాభ్యాసములు
   2.3. ఈషత్ స్పృష్టముల సాధనాభ్యాసములు
   2.4. ఈషత్ వివృతముల సాధనాభ్యాసములు
3. బాహ్య ప్రయత్నము- సాధనాభ్యాసములు
   3.1. అల్ప ప్రాణము మహాప్రాణముల మధ్య తేడా - - క చ, ట, త ,ప వర్గముల సాధనాభ్యాసములు
   3.2. వివారము, సంవారము మధ్య తేడా - క చ, ట, త ,ప వర్గముల సాధనాభ్యాసములు
4. అక్షర అభ్యాసంలో సందేహాలు- సమాధానాలు

## అనుబంధం 4 : అక్షర పద్మము - అక్షరాలు ఆత్మ వికాసము

1. అక్షర పద్మము
2. అక్షరాలు - మానసిక వికాసము
3. వాక్కు యొక్క నాలుగు అంశాలు
4. అక్షరాలు, ఓంకారము - అతి వాగుడికి మహా మౌనానికి మధ్య సరిహద్దు
5. అక్షర పద్మము -ఆవరణలు

# రచయిత పరిచయం



శ్రీ అక్షరం ఉమామహేశ్ బహుముఖ ప్రజ్ఞాశాలి, ప్రత్యేకించి అక్షర శాస్త్ర వేత్త. క్లౌడ్ కంప్యూటింగ్ రంగములో పనిచేసే వీరు **"డిజిటైజేషన్ నేపథ్యంలో వ్యక్తి పరిరక్షణ ,మరియు ప్రత్యేకించి బాలల పరిరక్షణ"** లక్ష్యంగా కృషి చేస్తున్నారు.

ప్రతి వ్యక్తి ఆత్మ విశ్వాసం కలిగి, ఆత్మ న్యూనత నుండి దూరంగా, జీవితాన్ని పరిపూర్ణంగా ఇతరులకు సహాయ పడుతూ గడపడమే సమాజంలో అతి ముఖ్యమైన విషయమని వీరి అభిప్రాయము.

అంతకుమునుపు అమెరికా, ఆసియా, యూరపు ఖండాల్లోని వివిధ దేశాల్లో గడిపిన వీరు గత దశకంగా ఆస్ట్రేలియాలో నివసిస్తున్నారు. ఇక్కడి వివిధ సాహితీ, నాటక, కళా, సాంస్కృతిక, సామాజిక రాజకీయ తార్కిక ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటూ వాచస్పతి గా, వక్త గా, రచయితగా, వీడియో బ్లాగర్ గా, ఇండాలజిస్టుగా, నటుడుగా, వాద్యకారునిగా, భాషా అధ్యాపకునిగా, కార్యకర్తగా అందరికీ పరిచితులు.

ఆస్ట్రేలియా, న్యూజిల్లాండ్ ప్రాంతాల్లో నిర్వహింపబడ్డ పౌరాణిక నాటకాల్లో వీరు పోషించిన మహాకవి కాళిదాసు, శ్రీ కృష్ణ దేవరాయలు , శివ యోగి , అర్జునుడు, శ్రీనాథ కవి మొదలైన పాత్రల ద్వారా వీరి అభినయం, గాత్రము అందరి మన్ననలు అందుకొన్నవి. తెలుగు పద్య అవధాన ప్రక్రియల నిర్వహణలలో పాల్గొన్నారు.

తమ 19 సంవత్సరముల యువ వయసులో, వీరు కుల మతములకు అతీతముగా తోటి యువకులను కూడగట్టి తమ స్వగ్రామములో శిథిలమయి, అనారోగ్య పరిస్థితుల్లో దురుపయోగము గావించబడుతున్న 400 యేళ్ళ ప్రాచీన చారిత్రక కట్టడాన్ని పునరుద్ధరించడము, బాల్యము నుంచీ వీరికి ఉన్న సామాజిక స్పృహకు నాయకత్వ లక్షణాలకు ఒక నిదర్శనం.

ఈ సందర్భముగా, వీరు ప్రాచీన భవన నిర్మాణ విధానాల్లో మన పూర్వీలు ప్రదర్శించిన పరిణితికి ఆకర్షితులై, చరిత్ర, భారతీయ శిల్ప, నాట్య, సంగీత శాస్త్రములు, ప్రాచీన గణిత, నగర నిర్మాణ, కాల గణన, రాజ నీతి, పాలన, వైద్య విధానాలు, వ్యవసాయ పద్ధతులను అధ్యయనము చేసారు. పై విజ్ఞానమును చర్చించే మూల గ్రంథాల అధ్యయనము కొరకు వీరు స్వయంకృషితో ప్రాచీనమైన తెలుగు, సంస్కృతము, వైదిక భాషా శాస్త్ర అధ్యయనము చేయ మొదలుబెట్టడము జరిగినది.

"గ్రేటర్ ఇండియా రీసర్చ్ ఫోరమ్" అనే థింక్ టాన్క్ మాధ్యమముగా వీరు భారతీయ సంతతి కొరకు "ఇండిక్ స్కాలర్స్ ఆన్ ఇంటర్నెట్", "నవో నవో భవతి జాయమానో", "మాతృకా మూవ్మెంట్" , "స్వాధ్యాయ-ప్రవచన నెట్వర్క్", "జీవ వైవిధ్య ఆయుర్వేద వనాల పెంపకం" వంటి వినూత్నమైన ప్రాజెక్ట్స్ చేపట్టారు.

ఆంగ్ల భాషలో వీరు వ్రాసిన "అక్షర విన్యాస - ద రైసిన్గ్ " అనే గ్రంథము భారతీయ అక్షరములపైన విజ్ఞాన సర్వస్వమనే చెప్పాలి. అక్షర విజ్ఞానం మరియు నందికేశ్వర కాశిక మొదలుగా అనేక తెలుగు గ్రంథాలు రచించారు. భాషా శబ్ద శాస్త్రము (ఫొనెటిక్స్) పరిశోధకులైన వీరు "GREATER INDIA PHONETICS ACADEMY" ద్వారా భారతీయ భాషా శబ్ద శాస్త్రాల అధ్యయనం, ఆధునిక కాలంలో వాటి అనువర్తనం, విద్యార్థుల శిక్షణ తదితర అంశాలపై కృషి చేస్తున్నారు..

విద్య మరియు వృత్తి రీత్యా పెక్కు భారతీయ మరియు వివిధ యూరపు భాషా ప్రాంతాల్లో నివసించిన కారణంగా వీరికి భాషా వైవిధ్య రక్షణకు ప్రాచీన భారతీయ భాషా వేత్తలు ప్రత్యేకించి తెలుగు కవులు చేసిన కృషి అవగతమైందంటారు.

వేల సంవత్సరాలుగా భారతీయుల భాషా వైవిధ్యం నిలబడటానికి రక్షణ గా నిలచిన అక్షరమాల వీరి కార్యక్రమములకు ప్రేరణ. ఈ అక్షరమాల ప్రేరణ తో " కాస్త ఓపికతో ఆలోచించి, పరస్పర సుహృద్భావాన్ని అలవర్చుకుంటే అన్ని సవాళ్ళను అధిగమించి సమాజంలో విభిన్న వర్గాల మధ్య ఐక్యత" సాధించవచ్చునేది వీరి ప్రగాఢ విశ్వాసం.

# అక్షరోద్యమ రచనలు- ధన్యవాదములు

నేను ఈ పుస్తకం వ్రాస్తున్నానంటే కారణము మొట్టమొదట ఈ శరీరం అనే అవకాశాన్ని ఇచ్చిన నా తల్లిదండ్రులు. ఆ తర్వాత తల్లిదండ్రుల ఆసరా లేకుండా రెక్కలొచ్చిన పక్షిలా బ్రతికే తెలివితేటలతో పాటూ, ఆలోచింపచేసే పరిస్థితులు కల్పించి, నిజాల్ని మార్మికంగా విశదపరిచే ఈ విశాలమైన ప్రకృతిని, ప్రథమ గురువుగా నమస్కరిస్తున్నాను.

భారతీయ ద్రష్టలు త్యాగ మూర్తులు. వీరు ఎన్నిదర్శించినా సాధించినా , వారి లక్ష్యము మాత్రము ప్రకృతి యొక్క హితము మాత్రమే. శరీరంలోని ప్రతి భాగం యొక్క శక్తినీ, ఇంద్రియాల శక్తిని, దాని అత్యున్నతమైన పరిధికి విస్తరింపచేసుకొని ఎరుక కలిగి అద్భుతంగా జీవించమని మన భారతీయ మేధావుల బోధనలలోని సారాంశము.

మనం గమనిస్తే యోగ శాస్త్రమైనా, నాట్య, సంగీత శాస్త్రాలైనా, సాహిత్యమైనా, అక్షరాలైనా మన విద్యల్లో ప్రతిదీ మనిషి శరీరాన్ని, మేధని, హృదయాన్ని పూర్తిగా/సంపూర్ణంగా ఉపయోగించడానికి ఆస్కారం ఇస్తాయి.. ఈ విద్యల ద్వారా అతి సుక్ష్మమైన విషయాలు ఆవిష్కరించబడ్డాయి. వీటి లక్ష్యం  మన జీవాన్ని ప్రాణాన్ని పూర్తి స్థాయిలో ఉపయోగించుకోవడమే. వీటిని తీవ్రంగా పరిశీలించి వాటి వెనకగల విజ్ఞానాన్ని అర్థం చేసుకుంటే, ఇక మనల్ని మనం అర్థం చేసుకోవడం సులువవుతుంది.

ఉదాహరణకు, యోగా ద్వారా శరీరంలో ప్రతి భాగం ఉపయోగించబడ్తుంది, అవధానం, సాహిత్య ప్రక్రియలలో మనిషి మేధ,హృదయం రెండు తారా స్థాయిలో ఉపయోగించబడును. అలాగే అక్షరాల వ్యవస్థ కూడా నోట్లో చేసే ఏ శబ్దాన్నయినా విడి విడి గా గుర్తించేలా కూర్చబడినది..

2017 వ సంవత్సరపు మాట. నేను అక్షరముల మీద, అక్షర విన్యాస - ద రైసిన్గ్ అనే ఆంగ్ల గ్రంథం వ్రాసినాను. గ్రంథపు మొదటి ప్రతిని శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్న జీయర్ స్వామి వారు ఆశీర్వదించారు, ఆపై శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ గారు ఆమోదించి

ఆవిష్కరించారు. రెండవ ముద్రణను శ్రీ శృంగేరీ పీఠాధిపతులు భారతీ తీర్థులు మరియు చిన్న స్వామి శ్రీ విధుశేఖరుల వారు అంగీకరించి ఆవిష్కరించగా, శ్రీ కంచి కామకోటి పీఠాధీశ్వరులు జయేంద్రుల వారు, శ్రీ విజయేంద్రుల వారు ఆశీర్వదించారు. ఆ పైన ఈ గ్రంథము శ్రీ ఉడుపి పెజావర పీఠాధిపతులు విశ్వేశ్వర తీర్థులచే అనుగ్రహింపబడింది.

అలా అలా అనేకమంది మాన్యులూ మరియూ సామాన్యుల వద్దకి చేరింది. వారిలో నా మిత్రులైన ఆస్తికులు, నాస్తికులూ, మానవ వాదులూ, మానవతా వాదులూ, సామ్యవాదులూ, యోగులూ, భాషావేత్తలు, కళాకారులు ... ఇతరత్రా ఎందరో పై ఆంగ్ల గ్రంథాన్ని గ్రంథంలోని అంశాలను ప్రతి తెలుగు వారికి అర్థమయ్యేలా వివరించే ప్రయత్నం చేయమని కోరడం జరిగింది. ఈ క్రమంలో నాలో జరిగిన అంతర్మథనమే అక్షర ఉద్యమానికి , దానిలో భాగమైన ఈ అక్షరోద్యమ రచనలకు శ్రీ కారం చుట్టడానికి కారణం. ఆ అంతర్మథనాన్ని మరో చోట వివరించే ప్రయత్నం చేస్తాను.

అక్షరోద్యమ రచనలలో భాగంగా నా ఆంగ్ల గ్రంథంలోని కొన్ని అంశాలను తిసుకొని తెలుగులో **అక్షర విజ్ఞానము అనే పుస్తకం వ్రాయడంతో పాటు , అక్షరాల్లోని మార్మికతను వివరించే నందికేశ్వర కాశిక ను తెలుగులోకి అనువదించడం జరిగింది. ఆపైన, అక్షర ఉద్యమం యొక్క అవసరం, స్వరూప స్వభావాలు, లక్ష్యాలు, ప్రణాళికలు మొత్తం ఒక చోట చేర్చి పాఠకులకు అందించాల్సిన అవసరం ఏర్పడినది.**
**ఈ కారణంగా జన్మనెత్తిన గ్రంథమే నా ఈ "అక్షరోద్యమం".**

ఉద్యమం అనగానే మనకు గుర్తుకు వచ్చేది ఉద్యమ కర్తలకు మరియు దాని ప్రతిపక్షమైన వ్యక్తులకూ/వ్యవస్థకూ మధ్య ఘర్షణ. కానీ నా అక్షరోద్యమం, అక్షరాల్లోని వైజ్ఞానిక సత్యాలు ప్రజలకు పంచడమే. ఇక్కడ అక్షరోద్యమంలో మన ప్రతిపక్షము అక్షరాల్లోని విజ్ఞానం తెలియనితనము లేదా తెలుసుకోని తనం. ఈ శాంతియుతమైన అక్షరోద్యమ లక్ష్యం ఆ అక్షరాల్లోని వైజ్ఞానిక సత్యాలు పూర్తిగా అందరికీ అర్థమయ్యేటట్లు చేయడము.

**సత్యాన్వేషణే అక్షరోద్యమం- అజ్ఞానపు చీకట్ల పై ఉద్యమిస్తూ ఉదయించే సూర్యునికి, అక్షర విజ్ఞానము పంచాలని ఉద్యమించే అక్షర సాధకుని ఆత్మకు భేదం లేదు.**

# అంకితం

ప్రపంచంలో అత్యధిక జనాభా మాట్లాడే ప్రాచీనమైన మాతృభాషలు భారతదేశంలోనే బ్రతికి ఉన్నాయి. ఈ భాషల శబ్దకోశములు తరతరాలుగా అలాగే కాపాడబడటానికి కారణం అక్షర వ్యవస్థ. మాతృభాషల పదకోశాలను, గర్భంలో పెట్టుకొని కాపాడే అమ్మ వంటివి, అక్షరములు.

మాటలు రాని పిల్లవాడే కాదు, మూగ వాడు కూడా ఆర్ద్రతతో పలకగలిగేవి అమ్మ అనే అక్షరాల సముదాయం.

జీవిని కరుణతో కాపాడే, "అమ్మ" అనే, మంత్రం వంటి పదానికీ, మాతృభాషలను కాపాడే, అక్షరములకు, భేదం లేదు.

ఈ అక్షరాలను వాడే మాతృ భాష, కలిగిన ప్రతి వ్యక్తికి, ఆత్మ విశ్వాసం కలిగించి, ఆత్మ న్యూనత నుండి దూరం చేసే, నా అక్షరోద్యమానికి అమ్మ లోని అపారమైన కరుణే, వెన్నుదన్ను.

కనుక నేను అక్షర పద్మము రూపంలో దర్శించిన పూర్తి అక్షరముల స్వరూపమునకూ, అమ్మ కి ఈ గ్రంథాన్ని అంకితం చేస్తున్నాను.



# ఈ పుస్తకమును ఎలా చదవాలి?

సాధారణంగా అక్షరములు అనగానే పిల్లలకు నేర్పే ఒక విషయమనీ , తమకు ఇంతకు మునుపే వచ్చిన సంగతి అనే అభిప్రాయంలో ఉండటం నేను గ్రహించాను. ఈ పుస్తకం చదవడానికి ముందు, దయ చేసి అక్షరముల గురించి అంతకు ముందు ఏ పరిజ్ఞానం లేదని ఊహించుకొని చదవడం మొదలు పెట్టండి. ఇది కేవలం, విషయాన్ని కొత్త దృక్పథం తో నేర్చుకోవడానికి ఒక చిన్న చిట్కా మాత్రమే.

అక్షరములు అంటే లిపి అని, అవి వ్రాయడం నేర్చుకొంటే వాటిని నేర్వడమయిపోయినట్లు మనం భావిస్తాము. కానీ అక్షర పద్ధతి శబ్దము మరియు శబ్ద ఉత్పత్తి స్థానముల మధ్య సంబధమును బట్టి వైజ్ఞానికంగా ఏర్పడిన పద్ధతి. కనుక నేను అక్షరముల గురించి వివరించినపుడల్లా చదువరులు శబ్దమునే ప్రధాన అంశము గా తీసుకోవలెను. శబ్దాన్ని వినడం, అది ఎక్కడనుంచి ఉత్పత్తి అవుతోందో గమనించాలంటే ఏకాగ్రత అవసరం. నేను ఇచ్చిన కొన్ని అక్షర అభ్యాసములు నిశ్శబ్దంగా ఉన్న చోట ఏకాగ్రతతో చేయవలెనని మీకు నా సూచన.

అక్షర వ్యవస్థను, దాని లోని వైజ్ఞానికత/సైన్సుని మత, రాజకీయ, కులం, ఇజమ్/భావజాలం మరియు ఒక సామాజిక దృక్కోణానికి కట్టివేసి అధ్యయనం చేయవద్దని మనవి. మతం, భావజాలం, సామాజిక పక్షపాత ధోరణులవలననే మాతృ భాషల హానికి ఆస్కారమెక్కువని తెలిన అంశము.

అక్షరోద్యమము యొక్క పాఠ్యాంశాలన్నీ ఈ పుస్తకం చివర అనుబంధము 1 నుండి 4 వరకు ఇచ్చిన విభాగాలపైన ఆధారపడి ఉన్నవి. ఈ పుస్తకం చివర ఇవ్వబడ్డ నాలుగు అనుబంధాలు అక్షర రహస్యాలను వివరిస్తాయి. కనుక వీటిని నిదానంగా ఆములాగ్రంగా అధ్యయనం అభ్యాసం చేయండి. అక్షర సాధకులు కండి. ప్రియమైన చదువరీ, నేను మిమ్మల్ని కోరేదల్లా మీరు ఈ అక్షరోద్యమం పుస్తకం ఆమూలాగ్రం చదివి అక్షర రహస్యాలు కూలంకషంగా తెలుసుకొని , అక్షరోద్యమంలో భాగంగా మరి తొమ్మిది మందికి అక్షర రహస్యాలు నేర్పండి. 'నవ' అంటే తొమ్మిది, అది ఎప్పుడూ కొత్తదే. కనుక మీరు నేరిపిన ప్రతి వ్యక్తీ మరో తొమ్మిది మందికి నేర్పమని కోరండి.

# మన అక్షరాలలో సైన్సు

మానవ సమాజపు ఆవిష్కరణలలో మన ప్రాచీన భారతీయ భాషా మేధావులు ఆవిష్కరించిన శబ్ద శాస్త్రము అత్యంత విజ్ఞానవంతమైనది .

ముఖ్యంగా మన అక్షరాల కూర్పులో ఒక గొప్ప సైన్సే ఉంది.
సాధారణంగా అక్షరములు అంటే లిపి అని, అవి వ్రాయడం నేర్చుకొంటే వాటిని నేర్వడమయిపోయినట్లు మనం భావిస్తాము.
కానీ అక్షర పద్ధతి అంటే లిపి కాదు, అదొక శబ్ద శాస్త్ర సారం.

ప్రపంచము మొత్తము మీద, కేవలం "అక్షర పద్ధతి/ అక్షర వ్యవస్థ" మాత్రమే శబ్దము మరియు శబ్ద ఉత్పత్తి స్థానముల మధ్య సంబంధమును బట్టి వైజ్ఞానికంగా ఏర్పడిన పద్ధతి.

శబ్దములు నోటిలో వివిధ స్థానముల నుండి ఉత్పత్తి అవుతాయి అన్న సత్యము, మొట్టమొదటగా షుమారు 4000 సంవత్సరములకు పూర్వమే భారతీయ వైదిక భాషావేత్తలు కనిపెట్టారు. ఆపైన ఈ శబ్దము, ఉత్పత్తి స్థానముల మీద, వర్గీకరణ పైన ప్రాచీన భారత దేశంలో అనేక ప్రయోగాలు, ఆవిష్కరణలు జరిగాయి. దాని ఫలితంగా ఏర్పడినవే మన అక్షరములు.

మన అక్షరముల కూర్పులో అనేక అనేక రహస్యాలు, వింతలు ఉన్నవి.

మొత్తం మీద మన అక్షరాల అమరికను ఒక మాత్రిక (గణితశాస్త్ర మాట్రిక్స్) లాగా లేదా ఒక పట్టిక లాగా మన ప్రాచీన భాషా వేత్తలు అమర్చారు. ఇది అచ్చుగా కెమిస్ట్రీ ఎలెమెన్ట్స్ టేబిల్ అంత ఆలోచనాత్మకంగా నిర్మించబడింది.

ఉదాహరణకి, మన అక్షరములలో క , చ, ట, త , ప అని అయిదు వర్గాలు గమనించే ఉంటారు. ఆ వరుసల వెనక సైన్సు రహస్యాలను చర్చిద్దాం.

సముహము 1- క నుంచి ఙ వరకు
సముహము 2- చ నుంచి ఞ వరకు
సముహము 3- ట నుంచి ణ వరకు
సముహము 4- త నుంచి న వరకు
సముహము 5- ప నుంచి మ వరకు

ఇపుడు మొదటి వర్గము అయిన 'క వర్గాన్ని" మీరు అర్థం చేసుకోవాలంటే ఒక్క సారి మీరు "ఖ ఖ" అని దగ్గి శబ్దము ఎక్కడ నుంచి వస్తోందో గమనించండి.
గొంతు లేదా కంఠము నుంచి, కనుక క వర్గాన్ని "కంఠ్యాలు అన్నారు.

ఇక మనం నేరుగా 'ప' వర్గానికి వెళ్దాము.

ఒక సారి ప ప ప, బ బ బ, మ మ అనండి. ఎక్కడ నుంచి శబ్దం వస్తోందో గమనించారా?
పెదాల ద్వారా .. కనుక వీటిని ఓష్ఠ్యాలు అన్నారు.

మధ్య లోని... చ వర్గము పలికేటపుడు, నాలిక వెనక్కి తగ్గి దవడల వద్ద ఒదిగి పోతుంది, కనుక ఇవి తాలవ్యాలు.




ట వర్గము పలికేటపుడు, నాలిక పైకి నిలబడి మాడు భాగం వైపు తాకబడుతుంది. కనుక ఇవి మూర్ధన్యాలు.

త వర్గము పలికేటపుడు, నాలిక ముందుకి సాగి పళ్ళని తంతుంది, కనుక ఇవి దంత్యాలు.

క చ ట త ప వర్గముల చివర వచ్చే ఙ, ఞ, ణ, న, మ ల వెనుక సైన్సు తెలియని కారణంగా "ఆడ లేక మద్దెల ఓడన్నట్లు" వాటిని తొలగించే ప్రయత్నం చేస్తున్నారు.
కానీ వీటి వెనుక చాల సైన్సూ ఉంది మరియు వీటిని నేర్వడమూ సులభమే.

ఒక సారి క్రింది విధంగా ప్రయత్నించండి.

1. 'గ' ను ముక్కుతో పలికితే 'ఙ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.
2. 'జ' ను ముక్కుతో పలికితే 'ఞ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.
3. 'డ' ను ముక్కుతో పలికితే 'ణ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.
4. 'ద' ను ముక్కుతో పలికితే 'న' సహజంగా ఉత్పత్తి అవుతుంది.
5. 'బ' ను ముక్కుతో పలికితే 'మ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.

ముక్కుతో పలుకబడుతాయి కనుక **ఙ, ఞ, ణ, న, మ** లను అనునాసికాలు అంటారు. దీన్ని నవీన కాలపు మేథమేటికల్ ఫార్ములే వంటి చిన్న పాటి సూత్రంలో (క్రింద ఇవ్వడం జరిగింది) చెప్పారు మన భారతీయ భాషా ఇంజనీర్లయిన ఋషులు.

**సూత్రం: ఞ మ ఙ ణ న నాం నాసికాచ**

అంతే కాక, ఒక వర్గములోని వర్ణానికి ముందు అచ్చుతో కలిసిన అనుస్వారము (పూర్ణబిందువు లేదా సున్న) వస్తే వర్గము చివరి ఉన్న అనునాసికలా అతి సహజంగా పలుకబడుతుంది చూడండి.

క్రింది ఉదాహరణలు మీకోసం-

క వర్గ ఉదాహరణ :- అంకము=అఙ్కము, అంగము = అఙ్గము
చ వర్గ ఉదాహరణ:- రాయంచ=రాయఞ్చ, అంజలి = అఞ్జలి
ట వర్గ ఉదాహరణ :- వంట=వణ్ట, అండము = అణ్డము
త వర్గ ఉదాహరణ :- బొంత=బొన్త , అందము = అన్దము
ప వర్గ ఉదాహరణ :- పంప=పమ్ప, అంబ = అమ్బ

ఇలాగ అక్షరాల వరుసలు వైజ్ఞానికముగా ఏర్పరచడము జరిగినది.

ఇంగ్లీషు ఆల్ఫబెట్స్ లో ఏ తర్వాత బీ , తర్వాత సీ తర్వాత డీ ఎందుకు వస్తాయి ఎందుకు వస్తుందో తెలియదు కానీ, మన అక్షరముల కూర్పులో శాస్త్రీయత, వైజ్ఞానికత ఉన్నది.

'క' అనే శబ్దానికి ఇంగ్లీషులో సి, కే అనే రెండు లిపి గుర్తులెందుకు ఇంకా ఉంచుకున్నారు?
బి యు టి బట్ అయితే పీయు టి పుట్ ఎందుకు, పట్ అవాలి కదా? జీ ఓ గో అయితే, డీ ఓ డూ ఎందుకు? వంటి ప్రశ్నలకు సమాధానం ఉన్నా లేకున్నా మన తెలుగు అక్షరాల కూర్పులో కావలసినంత సైన్సు ఉంది.

ఈ అక్షర రహస్యాలు సూత్రాలు నేను **అనుబంధము 2 - అక్షర విజ్ఞానం,** లో వివరంగా విశదీకరించడం జరిగింది. ఇవే అక్షరోద్యమంలో భాగంగా నేర్పే పాఠ్యాంశాల సారంశమని మీకు తెలియ పరుస్తున్నాను., కూలంకషంగా చదివి మీరు అక్షర సాధకులు అవగలరని నా ఆకాంక్ష. పాఠ్యపుస్తకము వలే, వాటినే అదే క్రమంలో చదవవలసినది. **అనుబంధము-3- అక్షర అభ్యాసములు** లో అక్షర అభ్యాసాలు ఇవ్వబడ్డాయి. వీటిని మీరు బాగా సాధన,చేస్తూ అక్షరాల్లోని సైన్సుని ఒంటబట్టించు-కొనండి. ఈ అక్షర అభ్యాసాల సందర్భంలో, అవసరమైనపుడల్లా, **అనుబంధము 2 - అక్షర విజ్ఞానంను** తిరగవేయండి. అక్కడ ఇవ్వబడిన అక్షర సూత్రాలను కంఠస్థం చేయండి, ఇది **అక్షరాల పై** మీకెంతో విశ్వాసం కలిగిస్తుంది.

సాధారణంగా అక్షరములు అనగానే పిల్లలకు నేర్పే ఒక విషయమనీ , తమకు ఇంతకు మునుపే వచ్చిన సంగతి అనే అభిప్రాయంలో ఉండటం నేను గ్రహించాను. ఈ పుస్తకం చదవడానికి ముందు, దయ చేసి అక్షరముల గురించి అంతకు ముందు ఏ పరిజ్ఞానం లేదని ఊహించుకొని చదవడం మొదలు పెట్టండి. ఇది కేవలం, విషయాన్ని కొత్త దృక్పథం తో నేర్చుకోవడానికి ఒక చిన్న చిట్కా మాత్రమే.

అక్షర వ్యవస్థను, దాని లోని వైజ్ఞానికత/సైన్సుని మత, రాజకీయ, కులం, ఇజమ్/భావజాలం మరియు ఒక సామాజిక దృక్కోణానికి కట్టివేసి అధ్యయనం చేయవద్దని మనవి. మతం, భావజాలం,

సామాజిక పక్షపాత ధోరణులవలననే మాతృ భాషల హానికి ఆస్కారమెక్కువని తేలిన అంశము.

అక్షరములు అంటే లిపి అని, అవి వ్రాయడం నేర్చుకొంటే వాటిని నేర్వడమయిపోయినట్లు మనం భావిస్తాము. కానీ అక్షర పద్ధతి శబ్దము మరియు శబ్ద ఉత్పత్తి స్థానముల మధ్య సంబధమును బట్టి వైజ్ఞానికంగా ఏర్పడిన పద్ధతి. కనుక నేను అక్షరముల గురించి వివరించినపుడల్లా చదువరులు శబ్దమునే ప్రధాన అంశము గా తీసుకోవలెను.

శబ్దాన్ని వినడం, అది ఎక్కడనుంచి ఉత్పత్తి అవుతోందో గమనించాలంటే ఏకాగ్రత అవసరం. నేను ఇచ్చిన కొన్ని అక్షర అభ్యాసములు నిశ్శబ్దంగా ఉన్న చోట ఏకాగ్రతతో చేయవలెనని మీకు నా సూచన.

## మన అక్షరాల చరిత్ర

వేదములను శృతి విద్య అంటారు. అంటే ఎలా చెప్ప బడినదో అలానే మరల మరలా పలికి నేర్చుకొని కంఠస్థము చేయాలి. అలాగే తర్వాతి తరాలకి ఇవ్వాలి. ఈ శబ్ద పరి రక్షణకు వైదిక భాషా వేత్తలు చాల శాస్త్రీయమైన , విజ్ఞాన పూర్వకమైన ఆవిష్కరణలు చేసారు. ఇవే ఆరు వేదాంగాలలోని ముఖ్యమైన నాలుగు భాగములు

1. **శిక్షా శాస్త్రము** - ఇది మన పుస్తకానికి అతి దగ్గరైన శాస్త్రము. ఈ శాస్త్రం ద్వారా శబ్దోత్పత్తి , అక్షర క్రమమునకు చెందిన సూత్రములు, ప్రాతిశాఖ్యలనే మరికొన్ని గ్రంథాల ద్వారా ఆ శబ్దాన్ని కాపాడుకొనే విధానాలు వివరించబడ్డాయి. ప్రపంచ చరిత్రలో మొట్టమొదటి శబ్ద శాస్త్ర విజ్ఞానానికి నాంది శిక్షా శాస్త్రమే.

2. **నిరుక్తము** - శబ్దాల/అక్షరముల నుంచి పదముల ఏర్పాటు, పద కోశాల నిర్మాణము గురించి చర్చించే శాస్త్రము. ప్రపంచ చరిత్రలో మొట్టమొదటి పద కోశములు లేదా డిక్షణరీ విజ్ఞానానికి నాంది నిరుక్త శాస్త్రమే.

3. **వ్యాకరణము** - నిరుక్తం లో పదాలు ఏర్పడితే, పదాల మధ్య సంబంధము అంటే సమాసాలు, విభక్తులు, కర్త కర్మ క్రియ మొదలైన అనేక విషయాలు వ్యాకరణంలో వివరించబడుతాయి. ప్రపంచ చరిత్ర లో మొట్టమదటిగా వ్యాకరణం సిద్ధాతీకరించబడినది భారత దేశంలోనే. అతి ప్రాచీనమైనవి వైదిక ప్రాతిశాఖ్యలు, మహేశ్వర సూత్రములు, అగస్త్య తమిళ వ్యాకరణము, పాణిని సంస్కృత వ్యాకరణము, పతంజలి మహా భాష్యము, అగస్త్యము-ఐంద్ర వ్యాకరణాలు ఆధారంగా నిర్మించబడ్డ తొలికాప్పియర్ వ్యాకరణము, కాతంత్ర వ్యాకరణము మొదలైనవి. ఇవి కనీసం 4000 సంవత్సరముల ప్రాచీనమైన పరంపర కలిగినవి.

4. **ఛందస్సు** - ఒక మంత్రంలో లేదా వాక్యంలో ఎన్ని అక్షరములు ఉండాలో నిర్దేశించేది. దీని ఖచ్చితత్వము కారణంగా కనీసం 5000 సంవత్సరములకు పూర్వమైన ఋగ్వేదమును యదాతథం గా ఇప్పటికీ కేరళ నంబూద్రి పండితులు ఉచ్చరించగలుగుతున్నారు.

ఇలా ఏర్పడిన వైదిక భాషా సూత్రాల ద్వారా అక్షర విధానము ఏర్పడ్డాయి. మన భారతీయ భాషలన్నీ అనుసరించే "అక్షర మాల", కనీసం ౩౦౦౦ సంవత్సరములకు పూర్వము నుండీ వైదిక ప్రాతిశాఖ్య మరియు వేదాంగ శిక్షా శాస్త్రము ప్రాతిపదికన సంస్కృత సూత్రాల ఆధారముగా నిర్మించబడ్డవి. "ఫొనెటిక్స్" గా నేడు ప్రచలితమైన "శబ్ద శాస్త్రము" భారత దేశపు వేదాంగ శిక్షా శాస్త్రము ద్వారా ప్రపంచానికి అందింపబడిన ఒక వరము .

*అక్షరములు అంటే లిపి అని, అవి వ్రాయడం నేర్చుకొంటే వాటిని నేర్చడమయిపోయినట్లు మనం భావిస్తాము. కానీ అక్షర పద్ధతి అంటే లిపి కాదు. ప్రపంచము మొత్తము మీద, కేవలం "అక్షర పద్ధతి/ అక్షర వ్యవస్థ" మాత్రమే శబ్దము మరియు శబ్ద ఉత్పత్తి స్థానముల మధ్య సంబధమును బట్టి వైజ్ఞానికంగా ఏర్పడిన పద్ధతి.*

శబ్దములు నోటిలో వివిధ స్థానముల నుండి ఉత్పత్తి అవతాయి అన్న సత్యము, మొట్టమొదటగా షుమారు 4000 సంవత్సరములకు పూర్వమే భారతీయ వైదిక భాషావేత్తలు కనిపెట్టారు. ఆపైన ఈ

శబ్దము, ఉత్పత్తి స్థానముల మీద, వర్గీకరణ పైన ప్రాచీన భారత దేశంలో అనేక ప్రయోగాలు, ఆవిష్కరణలు జరిగాయి. దాని ఫలితంగా ఏర్పడినవే మన అక్షరములు.

## అక్షరములు - విజ్ఞాన శాస్త్ర ఆవిష్కరణలు:

అక్షరములు కేవలము భారతీయులు భాషలకే కాక విజ్ఞాన శాస్త్ర ఆవిష్కరణలకూ ఉపయోగపడినవి. మొట్టమొదట ప్రపంచానికి సున్నను మరియు దశాంశమానాన్ని భారతీయ గణిత శాస్త్రవేత్తలు సిద్ధాంతీకరించి అందించారనడము నిర్వివాదాంశము.

ప్రపంచపు తొలి నిర్దిష్ట సాహిత్యమైన వేద భాగాల్లో 1 నుండి 9 అంకెలు,దశాంశ మానము, బేసి సరి సంఖ్యలు విరివిగా వాడబడ్డాయి. ఖగోళ గ్రహాల దూరాలు లెక్క కట్టే అతి పెద్ద సంఖ్యలకు వాటి దశాంశ స్థానములకు అక్షరములను వాడిన ఘనత ఆర్యభట్టుది. ఈ "క ట ప య" (కాది నవ టాది నవ పాది పంచ యాద్యష్ట ) అక్షరముల ద్వారా నిర్మించిన చిన్న పదాల రూపంలో ఖగోళ సత్యాలను కొన్ని వేల సంవత్సరములకు పూర్వమే ప్రపంచానికందించాడు. ఇదే స్ఫూర్తితో మరికొందరు సంగీత వేత్తలు, 72 మూల సంగీత రాగాలను ఈ అక్షర విధానంలోనే సులభంగా విభజించారు.

## భాషా వైవిధ్యత- దాని అవసరం :

సృష్టిలో మనిషికి ఉన్న ప్రత్యేకత మాట్లాడటం. విన్న శబ్దాలను అలాగే ఉచ్చరించగలిగే వాక్ శక్తి మనిషికి మాత్రమే సొంతం. ప్రతి శబ్దానికి ఒక అర్థము, ప్రయోజనము కల్పించుకొని పదాలు, వాక్యాలు ఏర్పడగా; వాటి ఆధారముగా జగతిలో వేలకు వేలు ఉచ్చరింపగలిగే భాషలు పుట్టాయి. మానవులందరూ సజాతీయులైనప్పటికీ, వారి వారి భౌగోళిక ప్రాంతములననుసరించి అనేక భాషల శబ్ద రాశి ఏర్పడినవి. దీన్నే భాషా వైవిధ్యత అన్నారు.

పరిశోధనల్లో భాగంగా 6,900 ప్రపంచ భాషలు విస్తరించిన ప్రాంతాలు మరియు ఆ ప్రాంతాల్లో ఉన్న జీవ వైవిధ్యమును కూలంకషంగా అధ్యయనము చేయడము జరిగినది. ఈ పరిశోధన ఫలితమేమిటంటే, 50% ప్రపంచ భాషలు కేవలము భారతదేశము, ఇండొనేసియా, పప్వా న్యూ గినియా, ఆస్ట్రేలియా, బ్రజిల్, మెక్సికో, నైజీరియా, కామెరూన్ దేశాల్లో ఉన్నాయి. ఈ ప్రాంతాలు ప్రపంచంలో అధిక జీవరాశి వైవిధ్యత కలిగిన ప్రాంతాలు. ఇక్కడ వివిధ రకాల జంతువులు, పక్షులు, మొక్కలు పదిలంగా ఉన్నాయి.

ఇంకా అనేక పరిశోధనల వలన ఎక్కడైతే భాషలెక్కువ ఉన్నయో అక్కడ జీవరాశి అధికంగా ఉండటము అనే అంశము నిరూపించబడినది.

కనుక జీవన వైవిధ్యాన్ని కాపాడుకోవాలంటే ఆ భాషా వైవిధ్యాన్ని సరిగ్గా కాపాడుకోవాల్సిన అవసరం ఉంది. ముఖ్యంగా ఆ భాషకు చెందిన పద సంపదను కాపాడుకోవాలి. దీనికి సరిపోయే ప్రక్రియ మన అక్షరాలు. మన అక్షరాలు ఉపయోగించి ఏమి చెబుతున్నారో అదే వ్రాయటం వీలవుతుంది. ప్రాచీన భరత ఖండం భాషా వైవిధ్యత కు నిలయం అంటే సందేహం లేదు

## భాషా వైవిధ్యత - అక్షర రక్ష

ప్రాచీన భరత ఖండం భాషా వైవిధ్యత కు నిలయం అంటే సందేహం లేదు. ఇప్పటి కూడా ఆ భరతఖండంలో చిన్న తునక అయిన స్వతంత్ర భారత దేశంలో కూడా 780 భాషలు, 66 వివిధ లిపులు, 1599 మాండలికాలు ఉన్నాయి. 2001 జనభా లెక్కల

ప్రకారం, 10 లక్షల మంది మాట్లాడే భాషలు 30 పై చిలుకు ఉంటే, కనీసం 10,000 మందికి పై చిలుకు మాట్లాడే భాషలు 122 ఉన్నాయి

ఒక భాషా భవనము యొక్క విస్తృతి, నిర్మాణము, అందము, పటుత్వము అనేవి ఆ భాష యొక్క పునాదులైన అక్షరముల మీద, పద నిర్మాణము, వాక్య నిర్మాణము మీద ఆధార పడి ఉంటాయి. వేలకు వేల సంవత్సరాలు భాషా శబ్దాలు, పద కోశాలు అలాగే కాపాడబడాలంటే ఏమి చెబుతున్నామో అదే వ్రాసే ఒక పద్ధతి ఉండాలి.

మన భారతీయ భాషలన్నీ అనుసరించే "అక్షర మాల" కారణముగా మనము ఏమి చెబుతామో అదే వ్రాస్తాము. అందువల్ల 2500 సంవత్సరాల పాటు అన్ని ఆటుపోట్లు తట్టుకొని భరత ఖండం భాషా వైవిధ్యత నిలబడ గలిగింది. అక్షర లిపిలో ప్రముఖ భాషల పదాలే కాక ఆది వాసీ భాషల పదాలను, మాండలిక పద కోశాన్ని కూడా ఎలా పలుకుతామో తరతరాలు అలాగే భద్రపరుచవచ్చు

అందువల్ల ప్రపంచము మొత్తము మీద, ఇప్పటికీ కొన్ని వందల మాతృ భాషల, వేల మాండలికాల భాషా వైవిధ్యత కేవలం భారతదేశంలో మాత్రమే మనుగడ సాగిస్తున్నాయంటే దీనికి ముఖ్య కారణం అక్షరాలు అనటంలో ఏమాత్రం సందేహం లేదు.

ఆ "అక్షర పద్ధతి/అక్షర వ్యవస్థ" నిర్వచించిన శబ్దాలను వ్రాయటానికి, దాదాపు భరత ఖండములోని అన్ని లిపులకూ వాడబడినది. భరత ఖండములో ప్రాంతము బట్టి అనేక లిపులు ఏర్పడినవి. భారత దేశంలో బుద్ధుని సమయానికే 60 కి పై చిలుకు లిపులు ఉండేవి. ఉదాహరణకి బ్రాహ్మీ లిపి, ఖరోష్టి వంటివి అతి ప్రాచీనమైన లిపులు. ఈ అక్షరక్రమము నేటికీ బిలియన్ల మందిచే వాడబడుతున్నది. సంస్కృతము మృత భాష అనే వారికి ఒక బిలియన్ పై చిలుకు భారతీయులు, దక్షిణాసియా, ఆగ్నేయ ఆసియాలో బ్రతికి ఉన్న వివిధ భాషల యొక్క అక్షరముల రూపములో సంస్కృతము అమర భాష అనే జవాబు లభిస్తున్నది.

## భరత ఖండము - అక్షర ఖండము- అక్షర భూమి:

ఈ అక్షరమాల కూర్పును భారతీయ భాషలే కాక దక్షిణాసియా, ఆగ్నేయ ఆసియా, మధ్య ఆసియా ప్రాంతపు అనేక భాషా సముదాయాలు ఆసరాగా తీసుకొన్నవి. దక్షిణ ఆసియా, ఆగ్నేయ ఆసియా , మధ్య ఆసియా లలో ప్రస్తుతం రాజకీయంగా విభజింపబడిన అనేక దేశాలు, సాంసృతికంగా మరియు భాషా పరంగా ముఖ్యంగా అక్షరముల కూర్పులో ఏకత్వాన్ని కలిగి ఉన్నాయి, కలిగి ఉండేవి. ఈ సాంస్కృతికమైన భూభాగాన్ని భరత ఖండము అనవచ్చు, ఇంకా **అక్షర భూమి లేదా అక్షర ఖండం గా పిలవడం** సబబు గా ఉంటుందేమో అని నా అభిప్రాయము.



ఈ అక్షర ఖండంలో ప్రస్తుత కాలపు శ్రీ లంక, భారత దేశము, పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, తుర్కెమెనిస్తాన్, ఉజ్బెకిస్తాన్, కిర్గిస్తాన్, తజకిస్తాన్, తిబెట్, నేపాల్, భూటాన్, యునాన్, బంగ్లా దేశ్, బర్మా, లావోస్, థాయిలాండ్, దక్షిణ/పడమర వియత్నామ్, ఫిలిప్పైన్స్, కాంబోడియా, మలేసియా, సింగపూర్, ఇండొనేసియా ఒకప్పుడు శబ్ద (అక్షర వ్యవస్థ) పరంగా సాంస్కృతికంగా సంబంధ బాంధవ్యాలు కలిగి ఉండేవి.

ఈ ప్రాంతములో మాట్లాడబడే అనేక భాషలు భారతీయ అక్షర వ్యవస్థ తో చాలా దగ్గర సంబంధము కలిగి ఉన్నాయి. అంటే ప్రపంచ వ్యాప్తంగా ఒక బిలియన్ పై చిలుకు ప్రజలు అక్షర వ్యవస్థనే ఆశ్రయించి నిత్య జీవితములో భాషా వైవిధ్యాన్ని కాపాడుకుంటున్నారు.

**మచ్చుకు కొన్ని అక్షర లిపులు క్రింద ఉదాహరణ గా ఇవ్వబడ్డాయి:**

| | | |
|---|---|---|
| āī<br>బ్రాహ్మీ | देवनागरी लिपि<br>దేవనాగరి | సిద్ధం |
| ప్రాచీన పర్షియా బాణ లిపి | శారద | పల్లవ |
| ఖరోష్ఠి | తెలుగు<br>తెలుగు | గ్రంథ |
| ಕನ್ನಡ<br>కన్నడ | മലയാളം<br>మళయాళ | தமிழ் எழுத்<br>తమిళ |
| ਗੁਰਮੁਖੀ<br>గురుముఖి -పంజాబీ (పాకిస్తాన్, భారతదేశం) | ગુજરાતી<br>గుజరాతీ | বাংলা<br>బెంగాలీ (బంగ్లాదేశ్, భారతదేశం) |

| | | |
|---|---|---|
| བོད་སྐད། తిబెటన్(తిబెట్) | සිංහල సింహళ(శ్రీలంక) | సింధీ (పాకిస్తాన్) |
| ଓଡ଼ିଆ ఒడియ | చమ్ (వియత్నామ్, కాంబోడియ) | မြန်မာစာ బర్మీస్ (మియన్మార్) |
| ภาษาไทย థాయి | హనునో (ఫిలిప్పైన్) | ພາສາລາວ లావో |
| လိၵ်ႈတႆး షన్ (యున్నన్, చైనా, బర్మా) | ភាសាខ្មែរ ఖ్మేర్ (వియత్నామ్) | జావనీస్ ఇండొనేసియా |

# మన భారతీయ భాషా వేత్తలు:

పేరుకోసం కాక సమాజం కోసం అద్భుత ఆవిష్కరణలు చేసిన కొందరు భారతీయ భాషావేత్తలను స్మరిద్దాము. యుధిష్ఠిర పండితులు మరియు మహా మహోపాధ్యాయ శ్రీ పుల్లెల రామచంద్రుల వారి అభిప్రాయము ప్రకారము, గత ఆరువేల సంవత్సరముల కాల పరిధిలో అనేక ఆవిష్కరణలు చేసిన మన భారతీయ భాషా వేత్తల పేర్లు -

అగస్త్య
శౌనక - ఋగ్వేద శబ్దశాస్త్రము
భాగురి
పౌష్కరసాద
చారాయణ
కాశకృత్స్న
శంతను
వ్యాఘ్రపాద
గార్గ్య
గాలవ
చక్ర వర్మణ
శాకల్య
మాధ్యందిన
రౌఢి
శౌనకి
గౌతమ
ఆపిశలి
కాశ్యప
శాకటాయన
స్ఫోటాయన
సేనక
పిఙ్గలుడు - ఛందస్ శాస్త్రము
యాస్క – నిరుక్త కర్త
భరత ముని- నాట్యము, రసము, అలంకారము
వ్యాడి - వ్యాకరణ వార్తిక కర్త
పాణిని - వ్యాకరణ కర్త

పతంజలి - పాణిని వ్యాకరణ మహాభాష్య కర్త
వరరుచి - పాణిని వ్యాకరణ వార్తిక కర్త
కణ్వ ముని - ప్రాచీన తెలుగు వ్యాకరణ కర్త
సారవర్మ - కాతంత్ర వ్యాకరణ కర్త
తొల్కాప్పియర్- ఐన్ధిర తమిళ వ్యాకరణ కర్త
ఆనందవర్ధనుడు - అలంకార శాస్త్రము
అభినవ గుప్తుడు - రస సిద్ధాంత కర్త
హలాయుధ - పిఙ్గల ఛందస్సు పైన భాష్యము, గణిత వేత్త

నన్నయ భట్టారకులు - ఆంధ్ర శబ్ద చింతామణి తెలుగు వ్యాకరణ కర్త
చిన్నయ సూరి - తెలుగు బాల వ్యాకరణ కర్త

## భాషా వైవిధ్యత కు పాటుబడిన వైదిక భాషా మేధావులు

**యాస్కాచార్యులు -పద కోశాల పరిరక్షణ** :

మొట్టమొదటి పద కోశాల పరిరక్షణ ప్రయత్నాలు భారతదేశంలోనే జరిగాయి. వీటికి మన అక్షరాలు, ధాతువులు జీవనాడి లాంటివి.
యాస్కాచార్యులు 4000 సంవత్సరాలకి పూర్వమే అక్షరాల సంయోగంతో ధాతువులు, వాటి నుంచి పదాల సృష్టి జరిగే విధానాన్ని అత్యంత శాస్త్రీయంగా (అంటే సైంటిఫిక్ గా అని) సిద్ధాంతీకరించి గురుకులల్లో శిష్య పరంపరకు నేర్పడం జరిగింది. తక్షశిల వంటి అతి ప్రాచీన విద్యాలయాల్లో ఈ పద కోశాలని చాల జాగ్రత్తగా నేర్చుకొని పరిరక్షించే వారు. దీన్ని నిరుక్త శాస్త్రం అంటారు. ఇప్పటి ఏటిమోలజీ , ఫిలోలజీ, డిక్షనరీలకు ఆధారం మన భారతీయ నిరుక్త శాస్త్రం.

**పాణిని మహర్షి - భాషా సూత్రాలు :**

నేటి కంప్యూటర్ యుగపు మేధావులు, ముక్కున వేలేసుకొనే విధంగా, చిన్న చిన్న ఫ్హార్ములే లాంటి భాషా సూత్రాల రూపంలో, "పాణిని మహర్షి" , కనీసం 3500 సంవత్సరములకు పూర్వమే, " అష్టాధ్యాయి" అనే గొప్ప భాషా శాస్త్రాన్ని తయారు చేసారు.

చిత్సభలో శ్రీ పరమేశ్వరుని నృత్తమును దర్శించిన వారిలో పాణిని మహర్షి శివుని ఢమరుక నాదముతో బోధించిన క్రింది మహేశ్వర సూత్రాల ఆధారముగా 'అష్టాధ్యాయి" అనే సంస్కృత వ్యాకరణాన్ని నిర్మించాడు.

అ ఇ ఉ ణ్
ఋ ఌ క్
ఏ ఓ ఙ్
ఐ ఔ చ్
హ య వ ర ట్
లణ్
ఞ మ ఙ ణ న మ్
ఝ భ ఞ్
ఘ ఢ ధ ష్
జ బ గ డ ద శ్
ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్
క ప య్
శ ష స ర్
హ ల్

వ్యాకరణ నిర్మాణంలో పాణిని కి మహేశ్వర సూత్రాలు ఎలా ఉపయోగబడ్డాయో అర్థం కావటానికి, మన తెలుగు భాషలో వాడే అచ్చులు హల్లులు ఈ మహేశ్వర సూత్రాల ఆధారంగా నిర్మించబడ్డ సంస్కృత వ్యాకరణమునుంచి దిగుమతి చేసుకొన్నవే. అదెలాగో గమనిద్దాం.

ప్రతి సూత్రము చివరి పొల్లును "ఇత్" అంటారు. దీన్ని నేటి కంప్యూటర్ సైన్స్ భాషలో చెప్పలంటే ఒక "డీలిమిటర్" వలే వాడుతారు. ఉదాహరణకు ప్రత్యాహారం "అణ్" అంటే "అ నుండి ణ్" వరకు 'ణ్' మినహాయించి ఉన్న అక్షరములు, అంటే "అ, ఇ, ఉ" లు.

ఇపుడు 'అచ్' అంటే చూద్దాం. మొదటి సూత్రము లోని 'అ' తో మొదలై '4 వ సూత్రము లోని చివరి 'చ్' మధ్య గల అక్షరములు. అంటే అచ్చంగా అచ్చులే.

1 నుండి 4 వ సూత్రము  వరకు ఉన్న వర్ణాలని అచ్ ప్రత్యాహారము ద్వారా సంస్కృత వ్యాకరణ సూత్రాలలో వాడుతారు. దీన్నే అచ్చులుగా తెలుగు స్వరములకి పేరు పెట్టారు.
( అచః స్వరాః )

అ ఇ ఉ ణ్ - 1
ఋ ౡ క్ - 2
ఏ ఓ ఙ్ - 3
ఐ ఔ చ్ - 4

అలాగే "హల్" అంటే 5 వ సూత్రము మొదటి అక్షరమునుండి 14 వ సూత్రపు చివరి 'ల్' వరకు గల 'హల్లులు".

5 నుండి 14 వ సూత్రము  వరకు ఉన్న వర్ణాలని హల్ ప్రత్యాహారము ద్వారా సంస్కృత వ్యాకరణ సూత్రాలలో వాడుతారు. దీన్నే హల్లులుగా తెలుగు వ్యంజనములకు పేరు పెట్టారు.

హ య వ ర ట్ - 5
లణ్ - 6
ఞ మ ఙ ణ న మ్ -7
ఝ భ ఞ్ - 8
ఘ ఢ ధ ష్ - 9
జ బ గ డ ద శ్ -10
ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ -11
క ప య్ -12
శ ష స ర్ -13
హల్ -14

ఈ అక్షరములను అనేక ఇతర సూత్రాల ఆధారంగా దీర్ఘాక్షరములు, అనునాసికలు, గుణింతాలు, సంధించిన సంయుక్తాక్షరములతో భాషా విశ్వరూపం చూపబడింది."కంప్యూటర్ సైన్స్ రికార్డ్ డీలిమిటర్" వంటి అనేక అంశాలను, ఈ ప్రత్యాహారాలనుపయోగించి చిన్న చిన్న ఫార్ములే లాంటి భాషా సూత్రాల రూపంలో, నేటి కంప్యూటర్ యుగపు మేధావులు, ముక్కున వేలేసుకొనే విధంగా "పాణిని మహర్షి" , 3000 సంవత్సరములకు పూర్వమే, గొప్ప భాషా శాస్త్రాన్ని తయారు చేసారు.

**వరరుచి కాత్యాయనుడు - భాషా వైవిధ్య రక్షకుడు- ప్రాకృత ప్రకాశము :**

श्री: ।

प्राकृतप्रकाश:

विद्वद्वरश्रीमद्भामहविरचितः ।

पण्डितकुलतिलकश्रीमद्वररुचिविरचित-
सूत्रसमलङ्कृतः ।

పాణిని వ్యాకరణానికి పతంజలి మహా భాష్యం వ్రాస్తే వరరుచి కాత్యాయనుడు వార్తికలు వ్రాసాడు. కేవలం సంస్కృత వ్యాకరణమే కాక పదాలు సంస్కృత సమానాలు, ప్రాకృత సమానాలు, సంస్కృత భవాలు, ప్రాకృత భవాలు, దేశ్యాలు, అన్యదేశ్యాలుగా విభజించారు. ఆ తత్సమ, తద్భవ, దేశజ, విదేశ్య పదకోశాలు చక్కగా కాపాడ బడే విధంగా తగు జాగ్రత్తలు తీసుకొన్నారు. వీరు వ్రాసిన ప్రాకృత ప్రకాశము అద్భుతమైన గ్రంథము, భాషా వైవిధ్య, మాతృభాషల పరిరక్షణకు ప్రపంచంలో మొట్టమొదటి ప్రయత్నం. భాషా వైవిధ్య రక్షణకు భారతీయ భాషా వేత్తలు చేసిన కృషికి ఒక మచ్చు తునక.

వీరి ప్రభావంతో పరిణితి చెంది విలసిల్లిన పార్వత, నాగరి, మాగధీ ,ఓఢ్ర, శూరసేని, మాహారాష్ట ఇత్యాది ప్రాకృతాల విభజన కాళిదాసు వంటి ప్రాచీన మహా కవులనుంచి తులసిదాస్ , మీరా వంటి అర్వాచీనులపై వరకు ప్రభావితం చేసింది.



## మన ప్రాచీన తెలుగు కవులు- భాషా వైవిధ్య రక్షణ :

మన ప్రాచీన తెలుగు భ్షాషా వేత్తలు సంస్కృతమునకే సొంతమైన శబ్ద సూత్రాలను దిగుమతి చేసుకొని ఆ పటిష్ఠమైన పునాదుల పైన తమ భాషా ఇన్జినీరింగ్ ప్రతిభ తో తెలుగుదనపు అందమైన గొప్ప భవనాన్ని నిర్మించారు. వారికి మనము ఎప్పుడూ ఋణపడి ఉంటాము.

### భాషా వేత్త నన్నయ :

ఉదాహరణకు, తెలుగు భాషా వేత్తలైన శ్రీ నన్నయ క్రీ .శ 1020 ప్రాంతములో పాణిని సంస్కృత వ్యాకరణము ఆధారము చేసుకొని, తెలుగు వ్యాకరణమును "ఆంధ్ర శబ్ద చింతామణి " అనే గ్రంథము రూపములో అందించారు. నన్నయ వారు, తెలుగు వ్యాకరణమును నిర్మించే విధానం లో నేటి కంప్యూటర్ యుగం లో గొప్పగా చెప్పుకొనే ఇన్హరిటెన్స్, పాలిమర్ఫిసమ్ వంటి వినూత్న మైన ప్రక్రియలు భాషా శాస్త్ర పరిధిలో వాడటం జరిగింది.

పాలనా పరమైన పదాలు, ఆధ్యాత్మిక/ మానసిక లోతులను వివరించే తాత్విక పదాలు గంభీరమైన సంస్కృత భాష సొంతం. నేరుగా సంస్కృతంలోని పదాలకు చివర తెలుగు విభక్తిని కలపగా వచ్చిన పదకోశాల సృష్టిచేసి సంస్కృత భాష యొక్క శక్తిని ఆవహించుకొనడం జరిగినది. అంతే కాక అనేక విధానాల ద్వారా వారు ఒక వైపు తెలుగు సొబగులను కాల రాయకుండా, అద్భుతమైన సంస్కృత శాస్త్రీయతను పుణికి పుచ్చుకొనే విధంగా తయారు చేసారు, భాషా వైవిధ్యతను కాపాడారు. తెలుగు భాషలో పదాలు సంస్కృత సమానాలు, ప్రాకృత సమానాలు, సంస్కృత భవాలు, ప్రాకృత భవాలు, దేశ్యాలు, అన్యదేశ్యాలుగా విభజించారు. ఆ తత్సమ, తద్భవ, దేశజ, విదేశ్య పదకోశాలు చక్కగా కాపాడ బడే విధంగా తగు జాగ్రత్తలు తీసుకొన్నారు.

## భాషా వైవిధ్యతకు ఉత్సవం చేసిన ఘనుడు- పాల్కురికి సోమనాథుడు :

సంస్కృత మాత్రా , వార్ణిక ఛందస్సు ప్రయోగాలతో ఆగక తెలుగు కవులు వృత్తాలు, ద్విపద, రగడ లాంటి అనేక ప్రయోగాల్లో సిద్ధహస్తులు. దేశీ చంధస్సులో తొలి తెలుగు కావ్యంగా 'ద్విపద'గా బసవపురాణాన్ని రచించిన యుగ కవి పాల్కురికి సోమనాథుని అక్షర పద్యాల సొబగులు అజరామరం. మచ్చుకి

*టటకిట టట్టకిట్టటట కిట్టటటట్ట టకిట్టటట్టకి*
*ట్టటకిట టట్టకిట్టట కిటట్టట టోన్మ్కఖటంకృతి స్ఫుటో*
*త్కటపటహాదినిస్వన వియత్తలదిక్తటతాటితార్భటో*
*ద్భట పటుతాండవాటన, "ట"కారనుత బసవేశ పాహిమాం!*

పోతన, తాళ్ళపాక కవులు, శ్రీనాథుడు, ధూర్జటి వంటి వారిని ఉత్తేజ పరచిన పాల్కురికి సోమనాథుడు సంగీత శాస్త్రంలోని 108 రాగాలను తాళములు, మూర్చనలు, సంస్కృతము పైనా గొప్ప అధికారం కల వాడు. విభక్తులు, అక్షరాల ప్రయోగాల సిద్ధ హస్తుడు. మొదటి శతక కర్త. భాషా వైవిధ్యతకు ఉత్సవం చేసిన ఘనుడు.

## టూకీగా తరువాతి తరం - భాషా వైవిధ్యత జిగిబిగి:

తరువాతి తరానికి చెందిన అల్లసాని తన కవిత్వంలో ఆ సౌకర్యాన్ని ఆసరాగా తీసుకొని జిగిబిగి అల్లికలు చేసారు. ప్రముఖమైన ఈ కవనం సగం అచ్చ తెలుగులో సాగితే సగం సంస్కృతం లో సాగిందని మనకి తెలిసినదే.

**పద్యము - అచ్చ తెలుగు వరుసలు**:

*పూఁత మెఱుంగులుం బసరుపూఁప బెడంగులుఁ జూపునట్టివా*
*కైతలు? జగ్గు నిగ్గు నెనగావలెఁ గమ్మనఁ గమ్మనన్వలెన్*
*రాతిరియున్ బవల్ మఱపురాని హొయల్ చెలి యారజంపు ని*
*ద్దా తరితీపులో యనఁగఁ దారసిలన్వలె లోఁ దలంచినన్*
*బాఁతిగఁ బై కొనన్ వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ*
*కూఁతలనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్*
*జేతికొలందిఁ గౌగిటను జేర్చిన కన్నియ చిన్ని పొన్ని మే*
*ల్మూఁతల చన్ను దోయివలె ముచ్చటగావలెఁ బట్టిచూచినన్*
*డాతొడనున్న మిన్నులమిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ*
*వాతెఱదొండపండువలె వాచవిగావలెఁ బంటనూదినన్*
*గాతలఁ దమ్మిచూలిదొర కైవసపుం జవరాలి సిబ్బెపు*

*న్మేతెలి యబ్బురంపు జిగి నిబ్బర పుబ్బుగు గబ్బిగుబ్బపొం*
*బూఁతల నున్న కాయ సరిపోఁడిమి కిన్నెర మెట్లబంతి సం*
*గాతపు సన్న తంతి బయకారపుఁ గన్నడ గౌళపంతుకా*
*సాతత తానతానలపసన్ దివుటాడెడు గోటమీటు బల్*
*మ్రోతలునుంబలెన్ హరువు మొల్లముగావలె*
*నచ్చతెన్గులీ రీతిగ సంస్కృతంబు పచరించెడు పట్టున*

## పద్యము - సంస్కృత పంక్తులు:

*భారతీవధూటీ తపనీయగర్భనికటీ భవ దానవపర్వసాహితీ*
*భౌతిక నాటకప్రకర భారత భారత సమ్మతప్రభా*
*శీతనగాత్మజా గిరిశశేఖర శీత మయూఖరేఖికా*
*పాతసుధాప్రపూర్ణ బహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ*
*జాతక తాళయుగ్మ లయసంగతి చుంచు విపంచికా మృదం*
*గాతత తేహితత్తహిత హాధితధంధణధాణధింధిమి*
*వ్రాతనయానుకూల పదవారకుహూద్వహ హారికింకిణీ*
*నూతనఘల్ఘలా చరణనూపుర ఝూళఝుళీ మరందసం*
*ఘాతవియద్ధునీ చకచక ద్వికచోత్పలసారసంగ్రహా*
*యాత కుమారగంధవహహారి సుగంధ విలాస*

### చివరిగా ఆ పద్యంలో తెలుగు సంస్కృతము కలకలిసి ప్రయోగించబడిన వరుసలు:

*యుక్తమై చేతము చల్లఁజేయవలె జిల్లన జల్లవలెన్ మనోహర*
*ద్యోతకగోస్తనీఫలమధుద్రవ గోఘృతపాయసప్రసా*
*రాతిరసప్రసారరుచిరప్రసరంబుగ సారె సారెకున్।*

## సృజనాత్మకతకు మరో ఉదాహరణ చిత్ర కవిత్వపు హొయలు:

చల జిహ్వ, అచల జిహ్వ అంటూ అక్షరముల ఉత్పత్తి స్థానముల బట్టి చిత్ర కవిత్వపు పద్యములల్లెడి వారు. పెదిమలు మాత్రమే తగులుతూ పలికేవి ఓష్ఠ్యాలు -ప,ఫ,బ,భ,మ; ఆ కారణం గా నాలుక కదలదు. అందుకే దీన్ని అచలజిహ్వ అన్నారు. ఉదాహరణ :

*మాపై పాపము ముప్పే*
*బాపుముమైమెప్పుపమ్మి ప్రభమింపుంబే*
*మీపైప్రేమంబేపై*
*ప్రాపైపెంపొప్ప మమ్ముఁ బంపుము భీమా*

సాహిత్య ప్రక్రియలలో ధాటి తగ్గిన కాలంలో శ్రీ ఆదిభట్ల వారు అచ్చ తెనుగు ప్రయోగాలకు మరల ఆజ్యం పోసారు.

# భాషా వైవిధ్యతకు ప్రతిరూపం  తెలుగు సాహితీ వృక్షం

అక్షరము పదంగా మారి, పదాల కలబోతతో వాక్యమేర్పడితే, అది అందముగా చెప్పబడినపుడు హృదయరంజకముగా ఉంటుంది. అదే సాహిత్యం. తెలుగు సాహితీ వృక్షము ఫల పుష్పభరితమైన అందమైన చెట్టు. ఈ చెట్టు వ్రేళ్ళు అక్షరాలు. పై కుదురు నిరుక్తము అనబడే పదకోశము, చెట్టు మ్రాను వ్యాకరణము మరియు కొమ్మలు వివిధరకాల ఛందో విధానాలు మరియు సాహితీ ప్రక్రియలు.

మొదటి నుండీ తెలుగు కవులు తమ భాష కాపాడుకుంటూ, భాష వైవిధ్యతను పెంచి పోషించిన వారు. మణిప్రవాళము అని ఎన్నో విదేశీ భాషలను చక్కగా తెలుగు పద్యాల్లో కలుపగలిగిన మేధావులు మన తెలుగు భాషా వేత్తలు. అందుకే తెలుగు, సంస్కృత, ఫార్సీ ఆంగ్ల,, కన్నడ తమిళ, ప్రాంతీయ మాండలిక, ఆదివాసీ పదాలు, కొత్త సాహితీ ప్రక్రియలు కలగలిసిన అందమైన వృక్షమే మన తెలుగు సాహితీ వృక్షము. ఈ వృక్షపు వ్రేళ్ళు అక్షరములు. అనేక అక్షరములున్నపుడే భాషా వైవిధ్యత సాధ్యము. ఎన్ని ఎక్కువ అక్షరాలుంటే అంతగా భాషా వైవిధ్యతకు పట్టం కట్టవచ్చు. కనుక మూలానికి తెగులు వృక్షానికి మంచిది కాదు.

## ఆ చెట్టు వ్రేళ్ళు అక్షరాలు

వేరెంత బలమో అంత బలంగా ఏపుగా చెట్టు వృద్ధి చెందుతుంది. వివిధ ప్రయోగాలకు అనుకూలంగా ఆ భాషా అక్షరములు ఉండాలి. అపుడే అర్థవంతముగా లయబద్ధముగా అందముగా పదసమూహాలతో అలంకరించాడానికి వీలవుతుంది. మాత్రా ఛందస్సు సంగీతాత్మకంగా వినసొంపుగా ఉండటానికి కారణం అక్షరాలే. ఇదే ఆంగ్లములో లేదా లేటిన్ ఆల్ఫబేట్ ఉపయోగించి ఇన్ని ప్రయోగాలు వీలుకాదు. మన అక్షరములలో వ్రాసినట్లైతే ఆంగ్ల ఫార్సీ పదాలతో కూడా కమనీయ కవిత్వం అల్లవచ్చు. ఇదే మన అక్షరాల శక్తి. మన తెలుగు భాష అక్షరములు. అనేక సూత్రాల ఆధారముగా అక్షర సమామ్నాయమును ప్రాచీన తెలుగు మేధావులు సిద్ధాంతీకరించారు. సూత్రాలు ఒక రకంగా గణితపు లేదా సైన్సు ఫార్ములే లాంటివి. అంతే కాక, అక్షర మాల పట్టిక, కెమిస్ట్రీ ఎలెమెన్ట్స్

టెబిల్ లాగా ఆలోచనావంతంగా ఏర్పర్చబడినది. ఎలిమెంట్స్ కలిస్తే కాంపౌండ్స్ వచ్చినట్లు క్రమ క్రమముగా విజ్ఞానాత్మకముగా మూల అక్షరములను దీర్ఘాలు, గుణింతాలు, సంధులు మొదలైన ప్రక్రియలతో విస్తరించుకొనవచ్చును. సులభంగా తార్కికంగా పిల్లలకు నేర్పించవచ్చు. ఫొనెటిక్ సూత్రాల విజ్ఞానమునకు ప్రతిరూపమైన తెలుగు లిపిలో అన్ని భాషా పదాలను మాండలిక శబ్దాలను ఎలా పలుకుతామో అలానే రక్షించుకోవచ్చును.



## సాహితీ వృక్షపు కుదురు నిరుక్తము :

అక్షరములను చక్కగా అల్లుకుంటూ పదములు పొందుపరచే పద్ధతి భారతీయులకు చిర పరిచితము. 2500 సంవత్సరములకు పూర్వముగా చెప్పబడే యాస్క నిరుక్తము, ప్రపంచపు మొదటి డిక్షనరీ మరియు ఏటిమోలజీ అనే శాస్త్రానికి మూలము. ఇదే స్ఫూర్తి తో "కాత్యాయన వరరుచి" 2100 సంవత్సరముల పూర్వము ప్రాకృత పదాలను వైదిక పదాలను, విదేశీ పదాలను చక్కగా విభజించి, భాషా వైవిధ్య రక్షణలో కృషిచేసారు. అదే ప్రేరణతో తెలుగు వారు గర్వించే విధంగా శివ కవులు, నన్నయ ఆదిగా అనేకులు చక్కగా - తత్సమ, తద్భవ, అచ్చ తెనుగు, ప్రాకృత, విదేశ్య పదములను చక్కగా వాడి కాపాడారు. ఏకాక్షర నిఘంటువులు అనేకములున్నవి.

## చెట్టు మ్రాను వ్యాకరణము:

పదకోశాన్ని ధాతువులుగా చేసుకొని క్రియా, విశేషణ, నామ వాచకముల మధ్య సంబంధాన్ని సమాస, విభక్తి తదితరములతో "వ్యాకరణ" ప్రక్రియకు ఆద్యులు, భారతీయులే. అన్ని సొబగులతో పాణిని వ్యాకరణపు ఆసరాతో తమిళ ఐంద్రము, కన్నడ కాతంత్రములను మించిన పద బంధాలకు, వాక్యాలకు ఆలవాలంగా మన సొంత వ్యాకరణాన్ని, తయారు చేసారు , తెలుగు భాషా వేత్తలు.

## కొమ్మలు వివిధరకాల ఛందో విధానాలు మరియు సాహితీ ప్రక్రియలు:

ఛద్ అంటే అందమని అర్థం. చెప్పే విషయం అందంగా చెప్పమనడమే "ఛాందసం" అనే పదానికి సాహితీపరమైన అసలు అర్థం. గద్య పద్య వాక్య నిర్మాణాల్లో అందమే దీని ఉద్దేశ్యము. పింగళుడు, హలాయుధుడు ఛందస్సు ను సిద్ధాంతీకరించిన గొప్ప గణిత మరియు భాషా వేత్తలు. గురు లఘువుల రూపంలో అల్లిన అనేక సూత్రాల్లో పాస్కల్ త్రిభుజము అని నేడు చెప్పబడుతున్న ఆధునిక గణిత సిద్ధాంతాలు చర్చించబడ్డాయి.

## అక్షర మాల విశ్వరూపం- భాషా వైవిధ్యత కు చిరునామా మన సంకీర్ణ అక్షరములు- :

క చ ట త ప వర్గాలు సవర్ణాలన్న విషయం మనం ముందు చెప్పుకొన్నాం, అంటే ఒకే స్థానం నుంచి పుట్టిన శబ్దాలు.

ఏ అక్షరమును ఉచ్చరించునపుడు, ఒకటికి మించిన శబ్దోత్పత్తి స్థానములను వాడుతామో వాటిని సంకీర్ణ అక్షరములని చెప్పవచ్చు. క్రింది సూత్రములు వివిధ సంకీర్ణ అక్షరములగూర్చి వివరిస్తాయి.

**సూత్రము 8- ఏ దై తోః కంఠ తాలు** : ఎ, ఏ, ఐ ఉత్పత్తిలో కంఠము , దవడలు కలిపి ప్రయోగించాలి, కనుక ఇవి సంకీర్ణములు.

**సూత్రము 9- ఓ దౌ తోః రోఒష్ఠం:** ఒ ఓ ఔ ఉత్పత్తిలో కంఠము , పెదవులు కలిపి ప్రయోగించాలి, కనుక ఇవి సంకీర్ణములు.

**సూత్రము 10- వ కారస్య దంతోష్ఠం :** వ కారము ఉచ్చరించాలంటే దంతము పెదవి కలబడును. కనుక దీన్ని దంతోష్ఠమ్ అన్నారు. ఇదే కోవకు చెందినది ఫ్హార్సి లో వాడే 'ఫ్హ' (fa) ఇది ఫ (pha) కు భిన్నమైనది. 'ఫ' ఉచ్చారణలో కేవలము పెదవులు వాడబడాలి, ఫ్హార్సి లో వాడే ' ఫ్హ ' ఉచ్చరించడానికి పై పెదవి క్రింది పళ్ళు వరుస కలిపి వాడాలి. ఉదాహరణ "ఫలము" ను "ఫ్హలము" అని తప్పుగా పలకటము మనకెరుకే.

చే జే ల ప్రయోగములో దవడలు, దంతములు కలిపి వాడాలి. ఇవి కేవలము తాలవ్యములైన చ జ లకు భిన్నమైనవి. అందుకే మీరు గమనిస్తే, చే జే ల పైన 'త' వత్తు పెట్టి 'దంతము యొక్క వర్గము-త" లక్షణముతో ఉచ్చరించమని సూచన గా తెలిపారు మేధావులైన మన ప్రాచీన తెలుగు భాషావేత్తలు. వీటిని t, d లకు ఆంగ్ల ఫోనెటిక్స్ లో ఉచ్చరించబడే tcha, dja లకు సమాంతరముగా కూడా ఉపయోగించుకొనవచ్చు. .

ళ ఱ ఴ లు తాలు మూర్ధన్యములు. సరళ, మఱ్రి ఇవేకాక తమిళ భాషలో వాడే "ఴ" ను కూడా మనము మన వర్ణమాలలో వ్రాయ వచ్చు, వాడుకొనవచ్చు ఉదాహరణ "పఴమ్" .

ఇదే విధముగా, ఫ్హార్సి లో వాడే ఖ్జ (ఖ్జాన్) ను జిహ్వామూలీయములం కోవలోనిది. అనగా విసర్గ ముందు కల ఖ్జ = ఃఖ+ ఆ . ఇదీ తెలుగులో ఫ్హార్సీ ఉరుదూ పద ప్రయోగాల్లో ఖచ్చితత్త్వానికి వాడవచ్చు.

ఇలా మన అక్షరముల సూత్రములనాధారము చేసుకొని ప్రపంచ భాషలు, ముఖ్యముగా మనము నిత్య జీవితములో వాడే పర భాషా పదాలు, మాండలికాలకు ఆలంబనగా వాడి వాటి మూలాలు కాపాడుకొనవచ్చునని నా పరిశోధనలో తేలిన సత్యము.

ఇలా భాషా వైవిధ్యమునకు ఆలంబన మన సంకీర్ణ అక్షరములు. ఈ సంకీర్ణ అక్షరముపు సంస్కృత శబ్ద శాస్త్రపు సూత్రాలే IPA ( ఇన్టర్నేషనల్ ఫొనెటిక్ ఆల్ఫబెట్ ) వారి ఆలోచనలుద్భవించడానికి మూల కారణం.

## మహా త్రిలింగ లిపి/పెను తెనుగు వ్రాలు

నేను సంస్కృత భాషా సూత్రాల ఆధారముగా తయారుచేసిన ఈ మహా అక్షర లిపి ని విద్యార్థులకు నేరిపించడము జరుగుతోంది. ఎన్నో భాషల శబ్దాలకాటపట్టైయిన మన తెలుగు అక్షరాల పట్టిక - "మహా త్రిలింగ లిపి/పెను తెనుగు వ్రాలు."

ఈ అక్షరముల పట్టికను "మహా త్రిలింగ/తెనుగు/తెలుగు లిపి" అని గానీ, "దొడ్డ/పెను తెనుగు వ్రాలు" అని గానీ, "తెలుగు కలగలుపు లిపి" అని గానీ , "తెలుగక్షరాల పెద్ద పట్టి" అని గానీ నేను ముద్దు గా పిలిచుకొని, విద్యార్థులకు నేర్పించడము జరుగుతున్నది.

ఎన్ని అక్షరాలు ఉంటే అంత మంచిది దాని కి ప్రతిరూపమే పెను తెనుగు వ్రాలు , ఇదే మన భారతీయ భాషావేత్తల హృదయం.

అందరమూ కలిసి మనం తెలుగు అక్షర మాల విశ్వరూపాన్ని పదిలంగా కాపాడుకుందాము రండి.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| **అ** | ఆ | క | ఖ | గ | ఘ | ఙ | | హ | ః |
| ఇ | ఈ | చ | ఛ | జ | ఝ | ఞ | య | శ | |
| | | ౘ | | ౙ | | | | | |
| ఋ | ౠ | ట | ఠ | డ | ఢ | ణ | ర | ష | |
| | | | | | | | ఱ | | |
| | | | | | | | ళ | | |
| | | | | | | | ఴ | | |
| ఌ | ౡ | త | థ | ద | ధ | న | ల | స | |
| ఉ | ఊ | ప | ఫ | బ | భ | మ | | | |
| ఎ | ఏ | | | | | | | | |
| ఐ | | | | | | | | | |
| ఒ | ఓ | | | | | | | | |
| ఔ | | | | | | | | | |
| అం | | | | | | | | | |
| అఁ | | | | | | | | | |
| | | వ | ఫ్హ | | | | | | |
| | | | ఖ్హ | | | | | | |
| | | | | | | | త్ర | జ్ఞ | క్ష |

**మహా త్రిలింగ లిపి/పెను తెనుగు వ్రాలు అక్షరాల పట్టిక**

# భాషా మరణం

భాషా మరణం అంటే క్రమ క్రమంగా భాష కనుమరుగవడం. ఇది అనేక రకాలుగా జరగ వచ్చు. ఉదాహరణకు-

1. ఆర్థిక ప్రయోజనాలు లేక క్రమ క్రమంగా మాతృ భాష క్షీణించడం
2. ప్రత్యేక సమయాల్లో తప్ప భాషను ఉపయోగించక పోవడం.
3. అధికారంలో ఉన్న ప్రభుత్వము , మతాధికారుల విధానాల వలన మాతృ భాషా మరణం
4. వ్యక్తిగత స్థాయిలో భాష పై పట్టు క్రమంగా తగ్గడం వలన ఏర్పడే మాతృ భాషా విముఖత
5. పదకోశాల , మాండలికాలకు పరిరక్షణ లోపించడం - డిఫెక్టివ్ ఆర్థోగ్రఫీ లో డిక్షనరీల తయారీ

## ప్రాచీన సాహిత్యము పై వేటు కి కారణాలేమిటి ?

ప్రాచీన ఛందో ప్రక్రియలను నేర్వడం సృజనాత్మకతకు , మేధస్సుకు మంచిది. నేటి కాలంలో మన భుక్తి కోసం నేర్చుకొనే అశాస్త్రీయమైన ఆంగ్ల స్పెల్లింగ్స్ కన్నా మన ఛందస్సులో పద్యమల్లడము కష్టమేమీ కాదు. కానీ ఈ ప్రక్రియల అవసరం, వాటిని సులభముగా నేర్పే ఉపకరణాలు, విధానాలు, నేటి వేగవంతమైన జీవనములో కొరవడ్డాయనడము నిర్వివాదాంశము. ఆధునిక సాహిత్యము , వ్యాసము మొదలైన ఇతర ప్రక్రియలు సులభముగా ప్రారంభించడానికి అనువైనవి. అయినప్పటికీ ఆధునిక సాహిత్యాన్ని మాత్రమే ఆదరించి, ప్రాచీన ప్రక్రియలను దూరంచేస్తే అది భాషా హత్య (లింగ్విసైడ్) యే అవుతుంది.

భాషను మనిషి యొక్క భావజాలం/ఇజం లేదా మతం , వర్గ ద్వేషం, రాజకీయ రంగులకు అతీతంగా ఉంచవచ్చు, అపుడు అది భాషా వైవిధ్యతకు సామరస్యానికి అనువుగా ఉంటుంది. కానీ భావజాలం/ఇజం లేదా మతం , వర్గ ద్వేషం, రాజకీయ ప్రాబల్యం వలన సంఘర్షణలు ఏర్పడి, మతం, రాజకీయం, ఇజం, వ్యాపారాల ప్రభావం వలన ప్రాచీన సాహిత్యానికి హాని అధికంగా ఉంటుంది.

## అక్షరాలు భావ జాలాలకు అతీతమైనవి

భాష , పద కోశాలలో భావ జాలం కనిపించినా అక్షరాలు మాత్రం వీటికి ఎల్లప్పుడూ అతీతమైనవే. . సినిమా హాలు అన్ని రకాల బహుముఖమైన సౌకర్యాలు కలిగి ఉన్నపుడు మంచి ఏఫెక్ట్స్ ఉన్న సినిమానూ వేయ వచ్చు, సాధారణమైన సినిమా ప్రదర్శించ వచ్చు. నా సినిమా ఎపుడూ సాధారణమైనదే అని థియేటర్ సౌకర్యాలను కుదింపు చేసినా సమస్యే, కేవలం గొప్ప సినిమాలు మాత్రమే ప్రదర్శించాలన్నపుడూ సమస్యే. మన అక్షర వ్యవస్థ అన్ని సౌకర్యాలున్న సినిమా థియేటర్ లాంటిదయితే సాహిత్యమొక సినిమా. మనం ఈ గొప్ప సినిమా హాల్లో జానపద సాహిత్యపు సినిమా ప్రదర్శించవచ్చూ ,వైదిక సాహిత్యమూ ప్రదర్శించనూవచ్చు. ఆధునిక వచనమూ నడిపించచ్చు, ప్రాచీన పద్యమూ ఆడించచ్చు. దేనికైనా ఎక్కువ అక్షరాలు కావాలి. ఎక్కువ అక్షర సంపద కలిగిన ఉన్నపుడే భాషా వైవిధ్యత సాధ్యము. ఎన్ని ఎక్కువ అక్షరాలుంటే అంతగా భాషా వైవిధ్యతకు పట్టం కట్టవచ్చు.

## ఆడలేక మద్దెల ఓడు-అక్షరాల తొలగింపు - ఒక భాషా హత్య

అక్షరముల్లో ఉన్న రహస్యాలు, అక్షరములను సులభంగా శాస్త్రీయంగా నేర్పించడము తెలియనపుడు అవి గుదిబండలుగా కనపడుతాయి. ఆడలేక మద్దెల ఓడన్నట్టు, వెంటనే అక్షరములను అవసరములేనివని మనమే ఊహించుకొని తొలగించడము జరుగుతుంది. ఋ,ౠ, ఌ, ౘ, ౙ ళ , అర సున్న, విసర్గ, ఙ, ఞ, లను కనీసము విద్యాలయాల్లో నేర్పించడానికి అనుమతి ఇవ్వక పోవడము

వలన, లేదా వాటి వాడకం తగ్గించే ప్రయత్నం వలన 2000 సంవత్సరముల తెలుగు సాహిత్యం తరువాత తరం వారికి అవసరంలేదు అనే నిర్ణయాన్ని రుద్దినట్లవుతుంది. క్రమముగా నేర్వడము కష్టమైనపుడు లేదా సమాచారము లుప్తమైనపుడు భాషా హాని జరుగుతుంది.

ఆపైన తరువాతి తరం వారు 2000 సంవత్సరముల భాషా చరిత్ర వారికి చెందినది కాదని అభిప్రాయపడి ఆత్మన్యూనత పొందే అవకాశమెక్కువ.

## ఋ ఌ ల ప్రత్యేకత

ఇవి వ్యంజనములూ (హల్లులు) కాదు స్వరములూ(అచ్చులు) కావు. కానీ వ్యాకరణ సుత్రాల కొరకు, శబ్దోత్పత్తి ని తెలియ పరచడానికి అచ్చులలో చేర్చాలి.

ఌ, త వర్గము, ల , స దంత్యములు. అచ్చులలో ఉండి 'ఌ' ఆ వర్గానికి ప్రతినిధిగా వ్యవహరిస్తుంది. అంతే కాక వ్యాకరణ సూత్రాలలో కూడా దీని అవసరం ఉంది.

ఋ, ట వర్గము, ర , ష మూర్ధన్యములు. అచ్చులలో ఉండి 'ఋ' ఆ వర్గానికి ప్రతినిధిగా వ్యవహరిస్తుంది. అంతే కాక వ్యాకరణ సూత్రాలలో కూడా దీని అవసరం ఉంది.

ముఖ్యంగా ఌ ను తొలగించడం సైన్సు ను అవమాన పరచినట్లే.

## డిఫెక్టివ్ ఆర్థోగ్రఫీ ఆధికారిక లిపులు - భాషల మరణానికొక కారణం

పరిమితమైన లిపి సంకేతలతో అస్తవ్యస్తంగా ఉన్న పరిస్థితిని **డిఫెక్టివ్ ఆర్థోగ్రఫీ** అనవచ్చును. ఇది భాషా వైవిధ్యతకు హానికారకం. ముఖ్యంగా **డిఫెక్టివ్ ఆర్థోగ్రఫీ** అధికారిక లిపి లో పట్టని మాతృ భాషల పద కోశాలు ప్రమాదంలో పడుతాయి.

సైన్సుకు దూరంగా ఉండే డిఫెక్టివ్ ఆర్థోగ్రఫీ అధికారిక భాష గాఉన్నపుడు అది ఇతర మాతృ భాషల మరణానికొక కారణం అవుతుంది.

ఉదాహరణకు ఆంగ్లంలో వ్రాస్తే cutamundra అబారిజినల్ పదం ను కూటమన్ద్రా అనాలో కాటమంద్రా అనాలో తెలియదు.

ఇలా ఇలా ఆ డిక్షనరీ ఉంచిన పదకోశాలు వాడకం కష్టమై లుప్తమవుతాయి. మాండలికాల మరణానికి, ఆదివాసీ పదాల అంతానికి, పదకోశాలు ప్రమాదంలో పడటానికి కారణం అస్తవ్యస్తంగా ఉండే పరిమితమైన ఆధికారిక లిపులు .

తక్కువ అక్షరాలు గల లిపులు ఇతర భాషల మరణానికి కారణాలు . దీనికి చక్కని ఉదాహరణ ఆంగ్ల డిజిటైజేషన్ లొ నలుగుతున్న తెలుగు అక్షరాలు.

## ఇంగ్లీష్ కీబోర్డ్ లో ప్రాణం కోల్పోతున్న తెలుగు పద కోశం-గజరాజుని చిన్న అగ్గిపెట్టెలో ఉంచడమే

ఒక గజరాజుని చిన్న అగ్గిపెట్టెలో ఉంచాలంటే, పెట్టెనైన ఏనుగంత పెద్దది చేయాలి, లేదా ఏనుగుని ముక్క ముక్కలు చేసి పెట్టెలో సర్దాలి. ముక్కలు ముక్కలు చేయడం వలన దాని ప్రాణం కోల్పోవడం సహజం. తెలుగు భాషా పదకోశాన్ని 26 ఇంగ్లీష్ అల్ఫబేట్ లో వ్రాయడము ఒక గజరాజుని చిన్న అగ్గిపెట్టెలో ఉంచడం లాంటిదే.



డిజిటైజేషన్ లో, ఇంటర్నెట్ మాధ్యమాల్లో ప్రస్తుతము ఆంగ్లము ప్రపంచములో ప్రథమ స్థానములో ఉన్నది. ఆంగ్లము ఇతర భాషలనుంచి అరువు తెచ్చుకొన్న పద సమూహాలతో అలరారే అందమైన భాష. కానీ

అందమైన వ్యక్తి మలినమైన దుస్తులు వేసుకొంటే అందవిహీనమ్గా కనబడినట్టు, ఆంగ్ల ఆల్ఫబేట్ మరియు స్పెల్లింగ్ వ్యవస్థలు ఆ అందమైన భాషను సంక్లిష్టము చేసాయి. దీని విషయంలో అనేక ఆంగ్ల భాషావేత్తలు ఇప్పటికీ సంస్కరణలకు ప్రయత్నిస్తున్నారు.

ఆంగ్ల ఆల్ఫబెట్ మరియు స్పెల్లింగ్స్ కారణంగా దెబ్బతిన్న/తింటున్న భాషల్లో తెలుగు కూడా ఒకటి. ప్రస్తుతము తెలుగు ప్రజలలో ఆంగ్ల ఆల్ఫాబెట్ ఆధారిత కీబోర్డ్ వాడకము అతి ప్రాచుర్యము సంతరించుకున్నది. మనకు తెలిసిన ఉదాహరణ "కడప" ను ఆంగ్ల స్పెల్లింగ్ వ్యవస్థననుసరించి "Cuddapah" గా నిర్మించగా "kadapa" గా ఈ మధ్య మనము మార్చుకున్న విషయము అందరికీ విదితమే. కానీ ఇంకా "kadapa" అంటే క’ద’ప అనాలో క’డ’ప అనాలో కన్ఫ్యూషనే ! ద, డ లకు - D ; శ, ష, స లకు -S ; త, ట లకు -T ; న , ణ లకు -N; ర, ఱ ల కు- R; ల, ళ లకు - L, చ, చే లకు - ch వాడటము మినహా ఆంగ్లములో ఇక వేరే మార్గం లేదు.

తెలుగును ఆంగ్ల లిపిలో వ్రాయడము ఎక్కువవౌతున్న కారణముగా తెలుగు వారు త్వరలో వారి పద కోశం కోల్పోయే ప్రమాదం పొంచి ఉన్నది. ఎత్తుగా ఉన్నాను పట్టను బాబోయ్ అంటే తల తెగనరుక్కో అనే సలహా వలె, ఆంగ్లము కోసం తెలుగు అక్షరాలు తగ్గించుకోమనే సంస్కర్తలూ సందర్భాలూ ఎదురవుతున్నవి. ఆంగ్లము కోసం తెలుగు అక్షరాలు తగ్గించుకోమనే సదరు మేధావులే , C-K' ; C-S; 'Z-G-J' వంటి ఆంగ్ల రిడన్డెన్ట్ లెటర్స్ పైన పెదవి కదుపరు.

ఆంగ్ల మాధ్యమాల్లో చదివే పిల్లలకు , ఆంగ్ల ప్రభావిత ప్రాంతాలలో నివసిస్తున్న భారతీయులకు తమ మాతృభాషలో తర్ఫీదు ఇవ్వడం ఒక పెద్ధ యజ్ఞం లాంటిది. దీనిలో అనేక సాధకబాధకాలు ఉన్నాయి. ముఖ్యంగా 10 నుంచి 12 గంటలు ఆంగ్ల మాధ్యమాల్లో మరియు ఆంగ్ల ప్రభావిత చర్చల్లో తలమునకలు అవుతున్న కారణముగా మాతృ భాష కన్నా వీరి పైన ఆంగ్ల ప్రభావం ఎక్కువ అవున్నది .

అంతేకాకుండా తెలుగు అక్షరమాలను ఆంగ్ల ఆల్ఫాబెట్ లో వ్రాయడము, టైప్ చేయడము అనే అలవాటు తామర తంపరగా వ్యాప్తి చెందింది.

దురదృష్టవశాత్తు శాస్త్రీయ సంగీతం గానీ తెలుగు పద్యం గానీ వ్రాయటానికి, తెలుగు పిల్లలు , పెద్ధలు ఇంగ్లీష్ నే ఉపయోగించడం

వలన అనేక భాషా ప్రమాదాలకు దారితీస్తున్నది. తెలుగు సంగీతాన్ని, పద్యాన్ని, మాటలను నేర్చుకునేటప్పుడు ఆ రచనలను ఆంగ్లంలో వ్రాయటం వల్ల భావమే మారిపోయే ప్రమాదం ఉంది.

ఉదాహరణకి : chedabatti అని వ్రాస్తే అది, చెడబట్టో, చెదబట్టో, చేదబత్తో చేదబట్టో తెలియదు

ATTA అని వ్రాస్తే అది 'అత్త, ' అనో లేదా ' అట్ట' అనో తెలియదు ,

RAMA అని వ్రాస్తే అది 'రామ' అనో లేదా 'రమ' అనో తెలియదు. క్రింద కొన్ని తెలుగు లిపి లోని వరుసలను ఇవ్వడం జరిగినది.

*"అక్షరములు అంటే లిపి అని, అవి వ్రాయడం నేర్చుకొంటే వాటిని నేర్వడమయిపోయినట్లు మనం భావిస్తాము. కానీ అక్షర పద్ధతి అంటే లిపి కాదు. ప్రపంచము మొత్తము మీద, కేవలం "అక్షర పద్ధతి/ అక్షర వ్యవస్థ" మాత్రమే శబ్దము మరియు శబ్ద ఉత్పత్తి స్థానముల మధ్య సంబధమును బట్టి వైజ్ఞానికంగా ఏర్పడిన పద్ధతి.*

*శబ్దములు నోటిలో వివిధ స్థానముల నుండి ఉత్పత్తి అవుతాయి అన్న సత్యము, మొట్టమొదటగా షుమారు 4000 సంవత్సరములకు పూర్వమే భారతీయ వైదిక భాషావేత్తలు కని పెట్టారు. ఆపైన ఈ శబ్దము, ఉత్పత్తి స్థానముల మీద, వర్గీకరణ పైన ప్రాచీన భారత దేశంలో అనేక ప్రయోగాలు, ఆవిష్కరణలు జరిగాయి. దాని ఫలితంగ ఏర్పడినవే మన అక్షరములు. "*

పైన ఇచ్చిన తెలుగు లిపి లోని క్రింది వరుసలను ఇంగ్లీష్ 26 పరిమిత ఆల్ఫబెట్స్ లో వ్రాస్తే చాల పొరబాట్లు, తప్పుడు శబ్దాలు వస్తాయి.

**ద, డ లకు - D ; శ, ష, స లకు -S ; త, ట లకు -T ; న , ణ లకు - N; ర, ఱ ల కు- R; ల, ళ లకు - L, చ, చే లకు -ch**
వాడటము మినహా ఆంగ్లములో ఇక వేరే మార్గం లేదు.

*Aksharamulu amte lipi ani, avi vrayadam nerchukomte vatini nervadamaepoinatlu manam bhavistham.kani akshara paddati amte lipi kaadu prapamcham mottam meeda kevalam akshara vyavasta matrame sabdam mariyu sabda upatti staanala Madhya sambandaanni batti vagnanikamgaa erpadina paddhati..*

*Sabdamulu notilo vividha sthanamula numdi utpati avutaayi anna satyamu, mottamodatagaa shumaaru 4000 samvatsaramulaku purvame bharatiya vaidica bhasha vettalu kanipettaru. Apina e sadbamu , utpatti sthaanamula mida vargikarana paina prachina bharata desamlo aneka prayogalu avishkaranalu jarigayi. Danii phalitamga erpadinave mana aksharamulu.*

దిన్ని చదివి ఎన్ని తెలుగు పదాలను తప్పుగా చదవవచ్చో పరిశీలించండి. దీన్నే డిఫెక్టివ్ ఆర్థోగ్రఫీ అంటారు.

కనుక అనేక మాతృ భాషల కలగలిసిన భాష వైవిధ్యత అనేది శరీరం వంటిది. అధికారిక డిఫెక్టివ్ ఆర్థోగ్రఫీ లిపులు శరీరాన్ని కలత పరిచేవి. అదే ఈ శరీరాన్ని కాపాడే పోషకాల లేదా రక్షక కణాల వంటివి విస్తృతమైన అక్షరాలు కలిగిన లిపులు. తెలుగు వారిగా మనం గర్వించాల్సిన విషయం, మన విసృతమైన అక్షర సంపద. మళయాళ, కన్నడము, సింహళము వారూ మనవలే అధికమైన అక్షరాలు కలిగి అటు సంస్కృతాన్ని , ప్రాకృత పద సంపదనూ కాపాడుకొన్నారు.

# అక్షరోద్యమము

మనిషి సత్యాన్వేషణతో తనను తాను తెలుసుకొనడమే గాక ప్రశాంతంగా చుట్టూ ప్రకృతిని అధ్యయనం చేయడం ద్వారా తన యొక్క మరియు తన చుట్టూ ఉన్న వారి మానసిక వికాసం మరియు శాంతి కోసం ప్రయత్నిస్తే, దాదాపు ప్రపంచంలో అన్ని వివాదాలకు వాటికవే తెరపడి సత్య యుగం లేదా స్వర్ణ యుగం వస్తుంది.

అక్షరాల సత్యాలను సైన్సును దర్శించి చుట్టూ వారికి ఆ సైన్సుని పంచడమే అక్షరోద్యమం. మనిషి తనలోని కొన్ని గొప్ప విషయాలను ఆవిష్కరించుకొనేందుకు చేసే సత్యాన్వేషణలో అక్షరోద్యమం చాలా ఉపయోగపడుతుంది. కనుక సత్యాన్వేషణే అక్షరోద్యమ మార్గం యొక్క లక్ష్యం.

ఉద్యమం అనగానే మనకు గుర్తుకు వచ్చేది ఉద్యమ కర్తలకు మరియు దాని ప్రతిపక్షమైన వ్యక్తులకూ/వ్యవస్థకూ మధ్య ఘర్షణ. కానీ నా అక్షరోద్యమం నిర్వచనం, అక్షరాల్లోని వైజ్ఞానిక సత్యాలు ప్రజలకు పంచడమే. ఈ ఉద్యమంలో ప్రతిపక్షము మన అక్షరాల్లోని రహస్యాలు తెలియనితనము, దాని వల్ల జనించిన ఆత్మ న్యూనత.

ఇక్కడ ఉద్యమ లక్ష్యము ఆ సత్యాలు అందరికీ పూర్తిగా అర్థమయ్యేటట్లు చేయడము . నేర్చుకున్న తర్వాత ఆత్మ విశ్వాసము, ఆత్మ గౌరవమూ, మనకు మన మీద ప్రేమా, మానసిక వికాసం కలగటము తథ్యము. ఒక వారాంతపు సమయం కేటాయిస్తే, అక్షర సత్యాలూ మరియూ రహస్యాలన్ని నేర్చుకోవచ్చు.

మానవ సమాజపు ఆవిష్కరణలలో మన ప్రాచీన భారతీయ భాషా మేధావులు కనుగొన్న శబ్ద శాస్త్రము మరియు అక్షరముల కూర్పు అత్యంత విజ్ఞానవంతమైనది . ప్రపంచము మొత్తము మీద, ఇప్పటికీ కొన్ని వందల మాతృ భాషల, వేల మాండలికాల భాషా వైవిధ్యత కేవలం భారతదేశంలో మాత్రమే మనుగడ సాగిస్తున్నాయంటే దీనికి ముఖ్య కారణం, శక్తివంతమైన మరియు ఉదాత్తమైన అక్షరాలు అనటంలో ఏమాత్రం సందేహం లేదు.

సాధారణంగా అక్షరములు అంటే లిపి అని, అవి వ్రాయడం నేర్చుకొంటే వాటిని నేర్వడమయిపోయినట్లు మనం భావిస్తాము. కానీ అక్షర పద్ధతి అంటే లిపి కాదు. ప్రపంచము మొత్తము మీద, కేవలం "అక్షర పద్ధతి/ అక్షర వ్యవస్థ" మాత్రమే శబ్దము మరియు శబ్ద ఉత్పత్తి స్థానముల మధ్య సంబంధమును బట్టి వైజ్ఞానికంగా ఏర్పడిన పద్ధతి.

సాధారణంగా అక్షరములు నేర్వడం గురించిన అంశము అనగానే, అక్షరములంటే పిల్లలకు నేర్పే ఒక చిన్నపాటివిషయమనీ , మనం ఇంతకు మునుపే నేర్చేసుకొన్నదనే ఒక అభిప్రాయంలో సాధారణంగా ఉంటాము.

కానీ వాస్తవానికి, ఎక్కువ శాతం తెలుగు మాతృ భాష గా గల పెద్దలకు, యువకులకు, తల్లిదండ్రులకు ముఖ్యంగా ఈ తరం అంటే 60 ఏళ్ల వయసు లోపు వారికి, మన అక్షరాల వెనుక సైన్సు/విజ్ఞాన రహస్యాల గురించి అవగాహన లేదనే విషయం కాస్త ఆందోళన కలిగించే అంశమే. ఉదాహరణకి, మన అక్షరములలో క, చ, ట, త, ప అని వరుసల ఎందుకు ఏర్పరిచారు? క తర్వాత ఖ, తర్వాత గ తర్వాత ఘ ఎందుకు? క, ఖ, గ , ఘ, ఙ వరుసలో చివర వచ్చే ఙ ఎలా పలకాలి? చే , జే పైన త వత్తు ఎందుకు కల్పించారు? మొదలైన ప్రశ్నలకు చాల కొద్ది మంది వద్దే వైజ్ఞానికమైన జవాబు లభిస్తుంది.

దీనికి కారణం, అక్షరాల వెనుక విజ్ఞానం మన ప్రాథమిక విద్యకి చెందిన పాఠ్య ప్రణాళికలో పాఠ్యాంశముగా లేక పోవడమే. ప్రస్తుతము, తెలుగు అక్షరములను వాటి వెనుక రహస్యాలను వివరించకుండా, ప్రయోగాత్మకమైన అభ్యాసాలు లేకుండా, అశాస్త్రీయంగా, ఒక లిపి లాగా బాగా రుబ్బించి, నేర్పించడమే దీనికి కారణం. ముఖ్యంగా అక్షర రహస్యాలు తెలిపే మన ప్రాచీన శబ్ద సూత్రాలను, మన తెలుగు పాఠ్య ప్రణాళికలు విస్మరించడం వలన అక్షరాల కూర్పు లో ఉన్న సైన్సు మనకు తెలియదు. ఈ పుస్తకంలో వ్రాసిన అక్షర రహస్యాలను నా విద్యాభ్యాసమయిన తర్వాత, ప్రాచీన శబ్ద సూత్రాలపైన అనుకోకుండా శ్రద్ధ ఏర్పడి చేసిన స్వంత పరిశోధనల ఫలితంగానే నేర్వడం జరిగింది.

ఆంగ్ల ఆల్ఫబేట్, మరియు స్పెల్లింగ్ వ్యవస్థకు వైజ్ఞానికతకు బారెడు దూరం. ఈ మధ్య కొన్ని తెలుగు ప్రాథమిక శిక్షణాలయాలు తెలుగు

అక్షరములు నేర్పడంలో ఆంగ్ల ఆల్ఫాబేట్ నేర్పించే విధానాలు మక్కికి మక్కీ కాపీ కొట్టడము జరుగుతోంది.

ఏ తర్వాత బీ , తర్వాత సీ తర్వాత డీ ఎందుకు వస్తాయి? 'క' అనే శబ్దానికి ఇంగ్లీషులో సి, కే అనే రెండు లిపి గుర్తులెందుకు ఇంకా ఉంచుకున్నారు? బి యు టి బట్ అయితే పీయు టి పుట్ ఎందుకు, పట్ అవాలి కదా? జీ ఓ గో అయితే, డీ ఓ డూ ఎందుకు? ఇలా తెలుగు అక్షరాల కూర్పు, ఆంగ్ల అల్ఫబేట్ కూర్పు మధ్య హేతుబద్ధమైన చర్చలేకుండా, తెలుగు అక్షరములు నేర్పడంలో ఆంగ్ల ఆల్ఫాబేట్ నేర్పించే విధానాలు కాపీ కొట్టడము కొరివితో తల దువ్వుకోవడమే, ఉన్న జుట్టు ఊడటం తప్ప, దువ్వుకోవడం అనేది జరుగదు. ఆ తర్వాత, ఆడలేక మద్దెల ఓడన్నట్లు, అక్షరములు సులభంగా నేర్వలేకపోతే, అవి గుది బండలుగా కనిపించి, వాటిని తొలగించే ప్రయత్నము చేయడం సహజమే.

పాఠ్యాంశాల్లో, పాఠశాలల్లో , పాఠ్యప్రణాళికల్లో, తెలుగు సంఘాలు నడిపే తెలుగు బడులలో ఎక్కడా కూడా ఈ అక్షర రహస్యాల పూర్తి వివరణే లేదనే విషయం కాస్త బాధకు గురిచేసి , దాన్ని పరిష్కరించే దిశ గా, మన అక్షరాల స్ఫూర్తి తో , అక్షరముల కూర్పులోని విజ్ఞానం మరియు రహస్యాలు ప్రతి ఒక్క తెలుగు వాడికి చేరాలనే శాంతియుతమైన సంకల్పంతో ప్రపంచ వ్యాప్తంగా నేను అక్షరోద్యమానికి శ్రీకారం చుట్టడం జరిగినది.

అక్షరోద్యమంలో భాగం గా మొట్ట మొదట గ్రంథ/పుస్తక మాధ్యమం రూపంలో అనుబంధంలో ఇచ్చిన నాలుగు అంశాల పైన పాఠ్య వనరులను తయారు చేయడం జరిగింది. ఆంతే కాక ఆడియో , వీడియో, మౌఖిక మాధ్యమాల రూపంలో అనుబంధంలో ఇచ్చిన నాలుగు అంశాల పైన పాఠ్యాంశాలు త్వరలో పూర్తి చేసి మీ ముందుకు తెచ్చే ప్రయత్నంలో ఉన్నాను.

# అక్షరోద్యమ లక్ష్యాలు

అక్షరోద్యమం ప్రస్తుతం క్రింది ముఖ్య లక్ష్యాలతో, కార్యక్రమాలతో సాగుతోంది -

- అక్షర రహస్యాలు /అక్షర విజ్ఞానం వనరులను అక్షరోద్యమంలో భాగం గా ఉభయ తెలుగు రాష్ట్రాల్లో నివసించే –
    - ప్రతి కుటుంబానికీ, ఆ కుటుంబంలోని ప్రతి వ్యక్తికి,
    - ప్రతి విద్యాలయానికి, విద్యాలయంలోని అధ్యాపక వర్గానికీ, ప్రతి విద్యార్థి కి,
    - ప్రతి కార్యాలయానికి, ప్రతి ఉద్యోగికి

  అక్షర రహస్యాలు అందచేయడం, , శిక్షణ ఇవ్వడం.

- అక్షర రహస్యాలు /అక్షర విజ్ఞానం వనరులను, అక్షరోద్యమంలో భాగం గా ఉభయ రాష్ట్రాల్లో కాక ఇతర రాష్ట్రాల్లో నివసించే ప్రతి తెలుగు వ్యక్తికీ అందచేయడం, , శిక్షణ ఇవ్వడం.

- అక్షర రహస్యాలు /అక్షర విజ్ఞానం వనరులను, అక్షరోద్యమంలో భాగం గా ప్రపంచ వ్యాప్తంగా, భారతదేశంలో కాక ఇతర దేశాల్లో నివసించే ప్రతి తెలుగు వ్యక్తికీ అందచేయడం, , శిక్షణ ఇవ్వడం.

- అక్షర రహస్యాలు తెలిపే మన ప్రాచీన శబ్ద సూత్రాలను , అక్షరాల వెనుక విజ్ఞానమును, మన ప్రాథమిక విద్యకి చెందిన పాఠ్య ప్రణాళికలో పాఠ్యాంశముగా అమలు చేయించడం.

- మన ప్రాథమిక విద్యకి చెందిన పాఠ్య ప్రణాళికలో పాఠ్యాంశముగా అమలు చేయించడం కొరకు విజ్ఞానాత్మకంగా అక్షర విజ్ఞానం వనరులను తయారు చేయడం, తయారు చేయడానికి సహాయంచేయడం.

- పరిమితమైన 26 ఆంగ్ల ఆల్ఫబెట్స్ లో వ్రాయబడుతున్నందు వలన జరిగే తెలుగు భాషా హాని గురించి విజ్ఞానాత్మకంగా

అక్షరోద్యమం వనరులను తయారు చేయడం. దీన్ని అందరి దృష్టికి తీసుకువెళ్ళి ప్రచారం చేయడం.

- తెలుగు భాషా హానిని అరికట్టడానికి విజ్ఞానాత్మకమైన పరిష్కారాలను ప్రచారం చేయడం, శిక్షణనివ్వడం మరియు వాటిని అమలు చేయించడం.

వీటిలో చాలా అంశాలు మొదలు పెట్టడం జరిగినది.

## అక్షరాలు ఆత్మ వికాసము:

అక్షరోద్యమ ముఖ్యమైన లక్ష్యం వ్యక్తి మానసిక మరియు ఆత్మ వికాసము. అక్షరాలను వాటి లో సైన్సును అర్థం చేసుకొంటే మానవులకు ప్రత్యేకమైన ఏకాగ్రత మరియు సూక్ష్మమైన అంశాలు గ్రహించే మానసిక శక్తి యొక్క మోతాదు పెంచుకోవచ్చని భరోసా ఇవ్వడం . ఈ అంశము యొక్క పుర్తి వివరాలు "అనుబంధము -4 అక్షర పద్మము, అక్షరాలు ఆత్మ వికాసము" లో ఇవ్వబడ్డాయి.

## అక్షర విజ్ఞాన సాధకులను తయారు చేయడం- నవో నవో భవతి జాయమానో

అక్షరోద్యమ పాఠ్య ప్రణాళిక బోధనాంశాలకు ఉపయుక్తమైనది ఈ "అక్షరోద్యమం" . ఈ పుస్తకం చివర ఇవ్వబడ్డ నాలుగు అనుబంధాలు అక్షర రహస్యాలను వివరిస్తాయి. ప్రియమైన చదువరీ, నేను మిమ్మల్ని కోరేదల్లా మీరు ఈ అక్షరోద్యమం పుస్తకం ఆమూలాగ్రం చదివి అక్షర రహస్యాలు కూలంకషంగా తెలుసుకొని , అక్షరోద్యమంలో భాగంగా మరి తొమ్మిది మందికి అక్షర రహస్యాలు నేర్పండి.

'నవ' అంటే తొమ్మిది, అది ఎప్పుడూ కొత్తదే. కనుక మీరు నేరిపిన ప్రతి వ్యక్తీ మరో తొమ్మిది మందికి నేర్పమని కోరండి. ఆ విధం గా మనం మన అక్షరాలనైనా పూర్తి స్థాయి లో అర్థం చేసుకుంటే తెలుగు భాష బలం అర్థం చేసుకోవడంలో ఒక చిన్న మెట్టు ఎక్కినట్లే.

# పరిమితమైన 26 ఆంగ్ల ఆల్ఫబెట్స్ లో వ్రాయబడుతున్నందు వలన జరిగే తెలుగు భాషా హానిని అరికట్టడం

ఇంగ్లీష్ 26 పరిమిత ఆల్ఫబెట్స్ లో వ్రాయబడుతున్నందు వలన జరిగే తెలుగు భాషా హాని" ని అరికట్టడమనే లక్ష్య సాధన గురించి కొన్ని విషయాలు మీకు వివరించే ప్రయత్నం చేస్తాను.

క్రింద కొన్ని తెలుగు లిపి లోని వరుసలను ఇవ్వడం జరిగినది.

*"అక్షరములు అంటే లిపి అని, అవి వ్రాయడం నేర్చుకొంటే వాటిని నేర్వడమయిపోయినట్లు మనం భావిస్తాము. కానీ అక్షర పద్ధతి అంటే లిపి కాదు. ప్రపంచము మొత్తము మీద, కేవలం "అక్షర పద్ధతి/ అక్షర వ్యవస్థ" మాత్రమే శబ్దము మరియు శబ్ద ఉత్పత్తి స్థానముల మధ్య సంబధమును బట్టి వైజ్ఞానికంగా ఏర్పడిన పద్ధతి. శబ్దములు నోటిలో వివిధ స్థానముల నుండి ఉత్పత్తి అవుతాయి అన్న సత్యము, మొట్టమొదటగా షుమారు 4000 సంవత్సరములకు పూర్వమే భారతీయ వైదిక భాషావేత్తలు కని పెట్టారు. ఆపైన ఈ శబ్దము, ఉత్పత్తి స్థానముల మీద, వర్గీకరణ పైన ప్రాచీన భారత దేశంలో అనేక ప్రయోగాలు, ఆవిష్కరణలు జరిగాయి. దాని ఫలితంగ ఏర్పడినవే మన అక్షరములు. "*

పైన ఇచ్చిన తెలుగు లిపి లోని క్రింది వరుసలను ఇంగ్లీష్ 26 పరిమిత ఆల్ఫబెట్స్ లో వ్రాస్తే చాల పొరబాట్లు, తప్పుడు శబ్దాలు వస్తాయి.

**ద, డ లకు - D ; శ, ష, స లకు -S ; త, ట లకు -T ; న , ణ లకు - N; ర, ఱ ల కు- R; ల, ళ లకు - L, చ, చే లకు -ch**
వాడటము మినహా ఆంగ్లములో ఇక వేరే మార్గం లేదు.

*Aksharamulu amte lipi ani, avi vrayadam nerchukomte vatini nervadamaepoinatlu manam bhavistham.kani akshara paddati amte lipi kaadu prapamcham mottam meeda kevalam akshara vyavasta matrame sabdam mariyu sabda upatti staanala Madhya sambandaanni batti vagnanikamgaa erpadina paddhati..*

*Sabdamulu notilo vividha sthanamula numdi utpati avutaayi anna satyamu, mottamodatagaa shumaaru 4000 samvatsaramulaku purvame bharatiya vaidica bhasha vettalu kanipettaru. Apina e sadbamu , utpatti sthaanamula mida vargikarana paina prachina bharata desamlo aneka prayogalu avishkaranalu jarigayi. Danii phalitamga erpadinave mana aksharamulu.*

దిన్ని చదివి ఎన్ని తెలుగు పదాలను తప్పుగా చదవవచ్చో పరిశీలించండి. దీన్నే డిఫెక్టివ్ ఆర్థోగ్రఫీ అంటారు.

అదే పైన ఇచ్చిన తెలుగు లిపి లోని వరుసలను ఐ ఎస్ ఓ 15919 లో వ్రాసినట్లైతే పొరబాట్లు, తప్పుడు శబ్దాలు తగ్గుతాయి, తెలుగు పద కోశాలకు హాని తగ్గుతుంది.

*akṣaramulu aṁṭē lipi ani, avi vrāyaḍaṁ nērcukoṁṭē vāṭini nērvaḍamayipōyinaṭlu manaṁ bhāvistāmu. kānī akṣara paddhati aṁṭē lipi kādu. prapaṁcamu mottamu mīda, kēvalaṁ "akṣara paddhati/ akṣara vyavastha" mātramē śabdamu mariyu śabda utpatti sthānamula madhya saṁbadhamunu baṭṭi vaiṅñānikaṁgā ērpaḍina paddhati.*

śabdamulu nōṭilō vividha sthānamula nuṁḍi utpatti avatāyi anna satyamu, moṭṭamodaṭagā ṣumāru 4000 saṁvatsaramulaku pūrvamē bhāratīya vaidika bhāṣāvēttalu kanipeṭṭāru. āpaina ī śabdamu, utpatti sthānamula mīda, vargīkaraṇa paina prācīna bhārata dēśaṁlō anēka prayōgālu, āviṣkaraṇalu jarigāyi. dāni phalitaṁga ērpaḍinavē mana akṣaramulu.

అలాగే మీ వద్ద సాధారణమైన ఇంగ్లీష్ కీ బోర్డ్ ఉన్నపుడు ఆ పరిమిత అల్పబేట్ను ఉపయోగించి , ఇంగ్లీషు పెద్ద(upper case) చిన్న (lower case) అల్పబేట్లను ఉపయోగించుకొని , ఎలా తెలుగు శబ్దాలు , అప శబ్దంగా మారకుండా వ్రాయవచ్చో హార్వర్డ్ క్యోటో, ఐ ట్రాన్స్ వంటి పద్ధతులు వివరించాయి.

కొన్ని ఉదాహరణలు:

**అ-a, ఆ-aa/A, ఇ-i, ఈ- ii/I , ఉ -u, ఊ-uu/U**

**ఋ-Ru, ౠ-RU**
**ఌ~lu, ౡ ~lU**
**ఎ -e ఏ -ee/E, ఐ -ai , ఒ -o ఓ-oo/O, ఔ -au,** అం -aM,, అః -aH
**క -ka, ఖ- kha, గ-ga ,ఘ-gha, ఙ -~ga**
**చ-ca/cha ,ఛ-Cha, జ-ja, ఝ-jha, ఞ ~ja**
**ట-Ta, ఠ- Tha, డ-Da, ఢ-Dha, ణ-Na**
**త-ta, థ-tha, ద-da, ధ-dha, న -na**
**ప-pa, ఫ-pha, బ-ba, భ-bha, మ -ma**
**య-ya, ర-ra, ల-la, వ-va**
**శ-Sa, ష-Sha, స-sa హ -ha**
**ళ-La, ఱ-rx, క్ష-ksha**



తెలుగును ఆంగ్లములో వ్రాసే పిల్లలకు పెద్దలకు, 26 ఆంగ్ల ఆల్ఫాబెట్ కు బదులుగా వాడటానికి నేను “ఐ ఎస్ ఓ 15919” అంతర్జాతీయ పద్ధతి ని నేర్పించడము, ఆ పద్ధతిని ప్రచారము చేయడము జరుగుతోంది.

స్వచ్ఛందంగా వీటికి సంబంధించిన వర్క్ షాప్ తరగతులు, లింగ్విస్టిక్ ల్యాబ్ మొదలైన అంశాలు వినూత్నమైన పద్ధతుల్లో నేరుగా గానీ, యూట్యూబ్, స్కయిప్ లేదా ఇతర సోషల్ మీడియా

వ్యవస్థల ద్వారా గానీ అంతర్జాతీయంగా నిర్వహించబడుతున్నవి. ఇవి నిర్వహించబడుతున్నవి.

దీని కారణంగా పిల్లలలో పెద్దలలో గణనీయమైన ఆత్మ విశ్వాసం, మన భాష , అక్షరాల పట్ల ఆత్మ గౌరవం పెరగటం జరుగుతోంది. ఈ తరగతుల్లో మన ప్రాచీన మన అక్షరాల్లో ఉన్నటువంటి శాస్త్రీయత ను, ఈ అక్షరమాలలో రహస్యాలను పిల్లలకు, పెద్దలకు అర్థమయ్యేటట్లు నేర్పించడం జరుగుతున్నది.

ఒకసారి ఐ ఎస్ ఓ 15919 వచ్చిన తర్వాత క్రమంగా వారికి తెలుగు లిపి గొప్పతనం అర్థమయ్యి మన భాష పట్ల ఆసక్తి పెరగడం మేము గమనించాం .

కనుక మన తెలుగు అక్షరాలను ఆంగ్ల ఆల్ఫాబెట్ మరియు స్పెల్లింగ్స్ లో వ్రాయడము మానుదాం, తద్వారా మన పద కోశాన్ని పదిలంగా కాపాడుకుందాం.

రండి... అక్షరోద్యమంలో పాల్గొని, ఇంగ్లిష్ 26 పరిమిత ఆల్ఫాబెట్స్ లో వ్రాయబడుతున్నందు వలన జరిగే తెలుగు భాషా హాని" ని అరికడదాం !

## ISO 15919 ను "తెలింగ్లిష్" అనడం అసత్యమే అవుతుంది - "తెలుగయ్యేసో" అనండి -- రచయితలకు విన్నపం

కొందరు రచయితలు, సంఘాలు, వెబ్సైట్స్ ISO 15919 ను తెలింగ్లిష్ అని ప్రాచుర్యం లో కి తెచ్చి ప్రచారం చేయడం తప్పుడు ప్రచారము మరియు అసత్యమే అవుతుంది.

ఎందుచేతనంటే , తెలుగును ఇంగ్లిష్ లో వ్రాస్తే తెలింగ్లిష్ అవుతుంది. తెలుగును ఇంగ్లిష్ లో వ్రాయడమంటే ఇంగ్లిష్ 26 పరిమిత ఆల్ఫాబెట్స్ లో వ్రాయడము. కానీ ఆ విధానం లో లోపాలు ఉన్నాయి కాబట్టే మనం ISO 15919 ను వాడుతున్నము . కనుక ISO 15919 ను ISO 15919 అని పిలవాలి తప్ప తెలింగ్లిష్ అనడం సత్య దూరం అవుతుంది.

తెలింగ్లిష్ అని ప్రాచుర్యం తేవడమంటే “తెలుగు ను ఇంగ్లిష్ 26 పరిమిత ఆల్ఫబెట్స్ లో వ్రాయడం వెనుక ఏ సమస్యా లేదు” అనే సత్య దూరమైన విషయాన్ని ప్రజలకు చెప్పినట్లు అవుతుంది. అంతే కాక ISO ఇంటర్నేషనల్ స్టాండర్డ్స్ వారి నిబంధనలను వమ్ము చేస్తూ వారి పద్ధతిని వీరు మరో పేరు తో ప్రాచుర్యం తేవడం బహుశా వైజ్ఞానికంగా అవగాహన లేక చేసి ఉండవచ్చు. ఇంకా పేరు పెట్టలనుకొంటే "తెలుగయ్యెస్వో" అని ISO ఇంటర్నేషనల్ స్టాండర్డ్స్ వారికి క్రెడిట్స్ ఇవ్వడం అర్థవంతంగా ఉంటుంది.

## హన్టేరియన్ పద్ధతి కన్న గొప్పదైన ట్రాన్స్లిటరేషన్ అవసరం

భారతియ అక్షరాలను రోమన్ ఆల్ఫబేట్ లిపి లో ట్రాన్స్లిటరేషన్ లేదా అనులేఖనం కొరకు భారత ప్రభుత్వం బ్రిటీష్ రాజ్యపు కాలం నాటి హన్టేరియన్ పద్ధతి వాడుతున్నారు. ఇంకా ఆ పద్ధతిలో

**ద, డ లకు - D ; ; త, ట లకు -T ; శ, ష, లకు -Sh** మొదలైన లోపాలు ఉన్నాయి. ఇనర్మేషన్ టెక్నాలజీ లో దిగ్గజమైన భారత దేశం మరియు భారతీయ శాస్త్ర రంగం ఇలాంటి సైన్సుకి దూరంగా ఉండే అనులేఖనం బదులుగా ISO 15919 లేదా దానికన్న గొప్పదైన లో ట్రాన్స్లిటరేషన్ వాడితే శాస్త్రీయంగా ఉంటుంది.

## తొలగించిన అక్షరాలని చేర్చాలి -పూర్తి అక్షర మాలను ప్రచారం చేయాలి.

అక్షరముల్లో ఉన్న రహస్యాలు, అక్షరములను సులభంగా శాస్త్రీయంగా నేర్పించడము తెలియనపుడు అవి గుదిబండలుగా కనపడుతాయి. ఆడలేక మద్దెల ఓడన్నట్టు, వెంటనే అక్షరములను అవసరములేనివని మనమే ఊహించుకొని తొలగించడము జరుగుతుంది. ఋ,ౠ, ఌ, చే, జే ళ , అర సున్న, విసర్గ, ఙ, ఞ, లను కనీసము విద్యాలయాల్లో నేర్పించడానికి అనుమతి ఇవ్వక పోవడము వలన, లేదా వాటి వాడకం తగ్గించే ప్రయత్నం వలన 2000

సంవత్సరముల తెలుగు సాహిత్యం తరువాత తరం వారికి అవసరంలేదు అనే నిర్ణయాన్ని రుద్దినట్లవుతుంది. క్రమముగా నేర్వడము కష్టమైనపుడు లేదా సమాచారము లుప్తమైనపుడు భాషా హాని జరుగుతుంది.

ఆపైన తరువాతి తరం వారు 2000 సంవత్సరముల భాషా చరిత్ర వారికి చెందినది కాదని అభిప్రాయపడి ఆత్మన్యూనత పొందే అవకాశమెక్కువ.

## ఋ మరియు ఌ :

ఇవి వ్యంజనములూ (హల్లులు) కాదు స్వరములూ(అచ్చులు) కావు. కానీ వ్యాకరణ సుత్రాల కొరకు, శబ్దోత్పత్తి ని తెలియ పరచడానికి అచ్చులలో చేర్చాలి.

ఌ, త వర్గము, ల , స దంత్యములు. అచ్చులలో ఉండి 'ఌ' ఆ వర్గానికి ప్రతినిధిగా వ్యవహరిస్తుంది. అంతే కాక వ్యాకరణ సూత్రాలలో కూడా దీని అవసరం ఉంది.

ఋ, ట వర్గము, ర , ష మూర్ధన్యములు. అచ్చులలో ఉండి 'ఋ' ఆ వర్గానికి ప్రతినిధిగా వ్యవహరిస్తుంది. అంతే కాక వ్యాకరణ సూత్రాలలో కూడా దీని అవసరం ఉంది.

ముఖ్యంగా ఌ ను తొలగించడం అక్షరాల సైన్సు ను అవమాన పరచినట్లే.

భాషా వైవిధ్యతకు అద్దం పట్టే విధంగా అన్నితెలుగు అక్షరాలను ఆదరించడం, వ్యవస్థీకరించడం ప్రభుత్వము, విద్యా మరియు శాస్త్ర సాంకేతిక రంగం చేతిలో ఉంది.

భావ జాలాలు, వాడుక లో ఉందా లేదా అనే చర్చలు మాని ఌ ను తిరిగి చేర్చాలి . దీనికి భారతీయ కేంద్ర రాష్ట్ర స్థానిక ప్రభుత్వాలి సిద్ధపడాలి.

# మేధోపరమైన హక్కులు ప్రాచీన భారతీయ భాషా వేత్తలవే

అక్షరాల పై, సూత్రాల పై ఋషులకే మేధోపరమైన హక్కులు. ఈ సందర్భంలో ఋషులకే మేధోపరమైన హక్కులను గౌరవిస్తూ ప్రాచీన సంస్కృత సూత్రాల ఆధారంగా సంప్రదాయ పద్ధతి లో అక్షరముల అభ్యాసం , ఆవిష్కరణలు జరపాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది. ఇది ప్రాచీన భారతీయ భాషా వేత్తలకు గొప్ప నివాళి ఇచ్చినట్లే.

# సాఫ్ట్వేర్ కంపెనీల ఇన్నొవేషన్/ఆవిష్కరణలు భాషా వైవిధ్యతని హత్తుకోవాలి

ఏదైనా ఒక సాఫ్ట్వేర్, సోషల్ మీడియా ఆవిష్కరణలు పూర్తిగా భాషా వైవిధ్యతను అక్కున చేర్చుకుంటేనే సార్ధకత. దీనికి ప్రతిరూపం unicode.org ( యూనికోడ్.ఓఆర్జీ) సంస్థ . వీరు అన్ని లిపులకు సాఫ్ట్వేర్ లో వాడకం కొరకు గొప్ప సదుపాయం కల్పించారు.

ఉదాహరణ కు తెలుగు-

| | 0 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | A | B | C | D | E | F |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| U+0C0x | ◌ఀ | ◌ఁ | ◌ం | ◌ః | □ | అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ | ఌ | | ఎ | ఏ |
| U+0C1x | ఐ | | ఒ | ఓ | ఔ | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట |
| U+0C2x | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న | | ప | ఫ | బ | భ | మ | య |
| U+0C3x | ర | ఱ | ల | ళ | ఴ | వ | శ | ష | స | హ | | | | ఽ | ◌ా | ◌ి |
| U+0C4x | ◌ీ | ◌ు | ◌ూ | ◌ృ | ◌ౄ | | ◌ె | ◌ే | ◌ై | | ◌ొ | ◌ో | ◌ౌ | ◌్ | | |
| U+0C5x | | | | | | ◌ౕ | ◌ౖ | | ౘ | ౙ | □ | | | | | |
| U+0C6x | ౠ | ౡ | ◌ౢ | ◌ౣ | | | ౦ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ |
| U+0C7x | | | | | | | | □ | ౸ | ౹ | ౺ | ౻ | ౼ | ౽ | ౾ | ౿ |

ఇక వాటిని ఉపయోగించి భాషా వైవిధ్యతకు అద్దం పట్టే విధంగా అన్ని తెలుగు అక్షరాలతో కీబోర్డు తయారు చేయడం,

వ్యవస్థీకరించడం ప్రభుత్వము మరియు శాస్త్ర సాంకేతిక రంగం చేతిలో ఉంది. ఇది ఆండ్రాయిడ్, ఆపిల్ కీబోర్డుల్లో, ప్రభుత్వ విద్యాసంస్థలలో - ఌ ను తిరిగి చేర్చడంతో మొదలవుతుంది.

సోషల్ మీడియా దిగజాలైన గూగుల్ , ఫేస్ బుక్ వంటి సంస్థలూ ఇదే విధంగా చేస్తే తెలుగు అక్షరాల సైన్సును సైంటిఫిక్ టెంపర్ ను ఆహ్వానించినట్లు అవుతుంది. ఇదే తెలుగు భారతీయ భాషా ఇంజనీర్లకు వారిచ్చే సరియైన నివాళి

## ఐ ఎస్ ఓ 15919 కీబోర్డు లను అందుబాటులోకి తేవడం.

దీనికి తోడు , గూగుల్ ఆండ్రాయిడ్, ఆపిల్ కీబోర్డుల్లో ఐ ఎస్ ఓ 15919 చేర్చితే ఆంగ్ల పరిమిత ఆల్ఫాబెట్ లో అక్షరాలను కుదించే కష్టం తెలుగు భాషకు తప్పుతుంది.

వీలైనంత వరకూ అవకాశం ఉన్న సాఫ్ట్వేర్ కంపెనీలు అక్షరాల అనువర్తనకి చెందిన సొల్యూషన్స్ ను విరివిగా సేవా దృక్పథంతో ఓపెన్ సోర్స్ వంటి లేదా ఉచితంగా అందుబాటులోకి తెస్తే అర్థవంతంగా ఉంటుంది.

## ట్రాన్స్లిటరేషన్ సాఫ్ట్వేర్ లో సిబ్బందికి శిక్షణ

కేంద్ర రాష్ట్ర స్థానిక ప్రభుత్వాల కార్యాలయములోని సిబ్బందిని ISO 15919 లేదా దానికన్న గొప్పదైన లో ట్రాన్స్లిటరేషన్ సాఫ్ట్వేర్ లో శిక్షితులు చేయాలి.

# అక్షరోద్యమ లక్ష్య సాధనకు మీ తోడ్పాటు కావాలి

మన సాహిత్యంలో బాగా కృషి చేస్తున్న వారు, తెలుగు సంఘాలు, కళా కారులు, అధ్యాపకులు/ఉపాధ్యాయులు, మీడియా రంగంలో మరియు వారి వారి రంగాల్లో నిష్ణాతులు, నిర్ణయం తీసుకునే స్థాయిలో ఉండే నాయకులూ, మతాధికారులు, నాస్తికులు, సైన్సు ప్రేమికులు, హేతు వాదులూ, సామాన్య ప్రజలూ అందరూ, మన అక్షరాల కూర్పు వెనుక ఉన్న సైన్సును అందరికీ పంచాలనుకొనే నా అక్షరోద్యమానికి తోడ్పాటు ఇవ్వాలని నా విన్నపము.

## ఈ అక్షరోద్యమ కార్యాచరణలో అక్షరాలు మీ సహాయం కోరుతున్నాయి.

సాహితీ వేత్తలు - సాహితీ సదస్సుల నిర్వాహకులకు ప్రత్యేక విన్నపం. ప్రతి సదస్సులో కనీసం ఒక అంశమైనా ఈ అక్షరోద్యమం పై అక్షరాల సైన్సు పై నిర్వహించి ఉపయుక్త మైన అక్షరాలకు చెందిన అంశాలు సాహితీ ప్రియులకు చేర్చమని అభ్యర్థన. ఇది చర్విత చరణమైన అంశమైనా మరలా మరలా అక్షరాలను అందరికీ గుర్తు చేయండి. సాహితీ వేత్తలారా, అక్షరోద్యమంలో పాల్గొని అక్షర విజ్ఞానాన్ని అందరికీ పంచండి. మీ కలాన్ని, పద్యాన్ని, కవితను, కథను ఒక్కసారి అక్షరోద్యమానికి ఉపయోగించండి.

విద్యా సంస్థ యాజమాన్యం, అధ్యాపకులు, విద్యా వేత్తలు , పరిశోధకులు ఈ అక్షరోద్యమం పుస్తకంలోని అంశాలను పాఠశాలల్లో కాలేజీలలోని విద్యార్థులకు బోధిస్తే ఇక భాషా పునరుజ్జీవనానికి ఢోకా ఉండదు. విద్యా రంగానికిదే విన్నపం.

మీడియా పత్రికా రంగం , సినిమా కళా సంస్థలు కళాకారులకు హార్దిక నమస్సులు. మీరు వ్యవస్థలో కీలకమైన వారు , మీరు అక్షరోద్యమములో పాల్గొని అక్షర విజ్ఞానాన్ని ప్రజలను చేర్చమని అభ్యర్థన.

నాసికులూ ఆస్తికులూ హేతువాదులు నమ్మకస్తులూ చిన్నలూ పెద్దలూ, ధనిక పేద అందరికీ కూడా అమ్మలాంటి మన అక్షరాలు ఆత్మీయమైనవే.

అక్షరాల వెనుక సైన్సుని పంచే ఈ అక్షరోద్యమంలో పాల్గొనాలని పైన ప్రస్తావించని ప్రతి రంగంలో ని వ్యక్తికీ విన్నపం.

అక్షరోద్యమము యొక్క పాఠ్యాంశాలన్నీ ఈ పుస్తకం చివర అనుబంధము 1 నుండి 4 వరకు ఇచ్చిన విభాగాలపైన ఆధారపడి ఉన్నవి. ఈ పుస్తకం చివర ఇవ్వబడ్డ నాలుగు అనుబంధాలు అక్షర రహస్యాలను వివరిస్తాయి. కనుక వీటిని నిదానంగా ఆములాగ్రంగా అధ్యయనం అభ్యాసం చేయండి. అక్షర సాధకులు కండి.

నేను మిమ్మల్ని కోరేదల్లా మీరు ఈ అక్షరోద్యమం పుస్తకం ఆమూలాగ్రం చదివి అక్షర రహస్యాలు కూలంకషంగా తెలుసుకొని , అక్షరోద్యమంలో భాగంగా మరి తొమ్మిది మందికి అక్షర రహస్యాలు నేర్పండి. 'నవ' అంటే తొమ్మిది, అది ఎప్పుడూ కొత్తదే. కనుక మీరు నేరిపిన ప్రతి వ్యక్తీ మరో తొమ్మిది మందికి నేర్పమని కోరండి.

ధన్య వాదాలతో

**-మీ అక్షరం ఉమామహేశ్**

**సత్యాన్వేషణే అక్షరోద్యమం- అజ్ఞానపు చీకట్ల పై ఉద్యమిస్తూ ఉదయించే సూర్యునికి, అక్షర విజ్ఞానము పంచాలని ఉద్యమించే అక్షర సాధకుని ఆత్మకు భేదం లేదు.**



## ఇంగ్లీష్ కీబోర్డ్ లో తెలుగు అక్షరములు

క్రింద కొన్ని తెలుగు లిపి లోని వరుసలను ఇవ్వడం జరిగినది.

*"అక్షరములు అంటే లిపి అని, అవి వ్రాయడం నేర్చుకొంటే వాటిని నేర్వడమయిపోయినట్లు మనం భావిస్తాము. కానీ అక్షర పద్ధతి అంటే లిపి కాదు. ప్రపంచము మొత్తము మీద, కేవలం "అక్షర పద్ధతి/ అక్షర వ్యవస్థ" మాత్రమే శబ్దము మరియు శబ్ద ఉత్పత్తి స్థానముల మధ్య సంబధమును బట్టి వైజ్ఞానికంగా ఏర్పడిన పద్ధతి. శబ్దములు నోటిలో వివిధ స్థానముల నుండి ఉత్పత్తి అవుతాయి అన్న సత్యము, మొట్టమొదటగా షుమారు 4000 సంవత్సరములకు పూర్వమే భారతీయ వైదిక భాషావేత్తలు కని పెట్టారు. ఆపైన ఈ శబ్దము, ఉత్పత్తి స్థానముల మీద, వర్గీకరణ పైన ప్రాచీన భారత దేశంలో అనేక ప్రయోగాలు, ఆవిష్కరణలు జరిగాయి. దాని ఫలితంగ ఏర్పడినవే మన అక్షరములు. "*

పైన ఇచ్చిన తెలుగు లిపి లోని క్రింది వరుసలను ఇంగ్లీష్ 26 పరిమిత ఆల్ఫబెట్స్ లో వ్రాస్తే చాల పొరబాట్లు, తప్పుడు శబ్దాలు వస్తాయి.

**ద, డ లకు - D ; శ, ష, స లకు -S ; త, ట లకు -T ; న , ణ లకు - N; ర, ఱ ల కు- R; ల, ళ లకు - L, చ, చే లకు -ch**
వాడటము మినహా ఆంగ్లములో ఇక వేరే మార్గం లేదు.

*Aksharamulu amte lipi ani, avi vrayadam nerchukomte vatini nervadamaepoinatlu manam bhavistham.kani akshara paddati amte lipi kaadu prapamcham mottam meeda kevalam akshara vyavasta matrame sabdam mariyu sabda upatti staanala Madhya sambandaanni batti vagnanikamgaa erpadina paddhati.. Sabdamulu notilo vividha sthanamula numdi utpati avutaayi anna satyamu, mottamodatagaa shumaaru 4000 samvatsaramulaku purvame bharatiya vaidica bhasha vettalu kanipettaru. Apina e sadbamu , utpatti sthaanamula mida vargikarana paina prachina bharata desamlo aneka prayogalu avishkaranalu jarigayi. Danii phalitamga erpadinave mana aksharamulu.*

దిన్ని చదివి ఎన్ని తెలుగు పదాలను తప్పుగా చదవవచ్చో పరిశీలించండి. దీన్నే డిఫెక్టివ్ ఆర్థోగ్రఫీ అంటారు.

అదే పైన ఇచ్చిన తెలుగు లిపి లోని వరుసలను ఐ ఎస్ ఓ 15919 లో వ్రాసినట్లైతే పొరబాట్లు, తప్పుడు శబ్దాలు తగ్గుతాయి, తెలుగు పద కోశాలకు హాని తగ్గుతుంది.

*akṣaramulu aṁṭē lipi ani, avi vrāyaḍaṁ nērcukoṁṭē vāṭini nērvaḍamayipōyinaṭlu manaṁ bhāvistāmu. kānī akṣara paddhati aṁṭē lipi kādu. prapaṁcamu mottamu mīda, kēvalaṁ "akṣara paddhati/ akṣara vyavastha" mātramē śabdamu mariyu śabda utpatti sthānamula madhya saṁbadhamunu baṭṭi vaiṅñānikaṁgā ērpaḍina paddhati.* śabdamulu nōṭilō vividha sthānamula numḍi utpatti avatāyi anna satyamu, moṭṭamodaṭagā ṣumāru 4000 saṁvatsaramulaku pūrvamē bhāratīya vaidika bhāṣāvēttalu kanipeṭṭāru. āpaina ī śabdamu, utpatti sthānamula mīda, vargīkaraṇa paina prācīna bhārata dēśaṁlō anēka prayōgālu, āviṣkaraṇalu jarigāyi. dāni phalitaṁga ērpaḍinavē mana akṣaramulu

అలాగే మీ వద్ద సాధారణమైన ఇంగ్లీష్ కీ బోర్డ్ ఉన్నపుడు ఆ పరిమిత అల్పబేట్స్ను ఉపయోగించి , ఇంగ్లీషు పెద్ద(upper case) చిన్న (lower case) అల్పబేట్లను ఉపయోగించుకొని , ఎలా తెలుగు శబ్దాలు , అప శబ్దంగా మారకుండా వ్రాయవచ్చో హార్వర్డ్ క్యోటో, ఐ ట్రాన్స్ వంటి పద్ధతులు వివరించాయి.

కొన్ని ఉదాహరణలు:

**అ-a, ఆ-aa/A, ఇ-i, ఈ- ii/I , ఉ -u, ఊ-uu/U**
**ఋ-Ru, ౠ-RU**
**ఌ~lu, ౡ ~lU**
**ఎ -e ఏ -ee/E, ఐ -ai , ఒ -o ఓ-oo/O, ఔ -au,** అం -aM,, అః -aH
**క -ka, ఖ- kha, గ-ga ,ఘ-gha, ఙ -~ga**
**చ-ca/cha ,ఛ-Cha, జ-ja, ఝ-jha, ఞ ~ja**
**ట-Ta, ఠ- Tha, డ-Da, ఢ-Dha, ణ-Na**
**త-ta, థ-tha, ద-da, ధ-dha, న -na**
**ప-pa, ఫ-pha, బ-ba, భ-bha, మ -ma**
**య-ya, ర-ra, ల-la, వ-va**
**శ-Sa, ష-Sha, స-sa హ -ha**
**ళ-La, ఱ-rx, క్ష -ksha**

| తెలుగు | ISO15919 | ASCII |
|---|---|---|
| అ | a | a |
| ఆ | ā | A/aa |
| ఇ | i | I |
| ఈ | ī | I/ii |
| ఉ | u | U |
| ఊ | ū | U/uu |
| ఋ | r̥ | RRi/R^i/Ru |
| ౠ | r̥̄ | RRI/R^I/RU |
| ఌ | l̥ | LLi/L^I /~lu |
| ౡ | l̥̄ | LLI/L^I/~lU |

| | | |
|---|---|---|
| ఎ | e | e |
| ఏ | ē | E/ee |
| ఐ | ai | ai |
| ఒ | o | o |
| ఓ | ō | O/oo |
| ఔ | au | au |
| (అ) ం | (a) ṁ | M/.m |
| (అ) ః | (a) ḥ | H |
| | | |

| | | |
|---|---|---|
| క్ | k | K |
| ఖ్ | kh | Kh |
| గ్ | g | g |
| ఘ్ | gh | gh |
| ఙ్ | ṅ | ~n |

| | | |
|---|---|---|
| చ్ | c | ch |
| ఛ్ | ch | Ch |
| జ్ | j | j |
| ఝ్ | jh | Jh |
| ఞ్ | ñ | ~N |
| ట్ | ṭ | T |
| ఠ్ | ṭh | Th |
| డ్ | ḍ | D |
| ఢ్ | ḍh | Dh |
| ణ్ | ṇ | N |
| త్ | t | T |
| థ్ | th | th |
| ద్ | d | D |
| ధ్ | dh | dh |
| న్ | n | N |
| ప్ | p | P |
| ఫ్ | ph | ph |

| | | |
|---|---|---|
| బ్ | b | B |
| భ్ | bh | bh |
| మ్ | m | m |
| య్ | y | v |
| ర్ | r | r |
| ల్ | l | l |
| వ్ | v | |
| శ్ | ś | sh |
| ష్ | ṣ | Sh |
| స్ | s | s |
| హ్ | h | h |
| ళ్ | ḷ | L |
| ఱ్ | ṟ | R |
| ఴ్ | ḻ | zh |
| ఫ్ | f | f |
| క్ష | kṣa | kSha |

# అక్షరమాల - సూత్రములు

పెద్ద విషయాన్ని చిన్న సూత్రాలలో సులభంగా చెప్పారు మన పూర్వీకులు. తరువాతి అంశాలకు పోయే ముందు, ఈ క్రింది సూత్రాలను కంఠస్థము చేయాలి. ఈ సూత్రాలు వస్తే, అక్షరముల రహస్యాలు పట్టువడినట్లే.

గమనిక, క్రింది సూత్రముల గుంపును ఇలాగే కంఠస్థము చేస్తే, మన ప్రాచీన సంస్కృత భాషా వేత్తలకు అలాగైనా కృతజ్ఞత చెప్పుకొనవచ్చు. వారి నుంచి వచ్చిన సూత్రాలు అక్షరముల పైన కట్టిన భాషా సౌధం పైన విహరిస్తూ పునాదులను మరవడము, పునాదులవన్నీ మార్చి తమదిగా చెప్పుకొనడం మన సంస్కృత భాషా వేత్తల ఇంటలెక్టువల్ ప్రాపర్టీ రైఃట్స్ (మేధో హక్కులను, నియమాలను) ను వేళాకోళం చేయడమే.

**పదునాలుగు మహేశ్వర సూత్రములు :**

అ ఇ ఉ ణ్ - 1
ఋ ఌ క్ - 2
ఏ ఓ ఙ్ - 3
ఐ ఔ చ్ - 4
హ య వ ర ట్ - 5
లణ్ - 6
ఞ మ ఙ ణ న మ్ -7
ఝ భ ఞ్ - 8
ఘ ఢ ధ ష్ - 9
జ బ గ డ ద శ్ -10
ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ -11
క ప య్ -12
శ ష స ర్ -13
హల్ -14

అక్షరమాల కూర్పుకు చెందిన రహస్యాలు పైన **పదునాలుగు,** క్రింది **పదునాలుగు** సూత్రముల ఆధారముగా సవివరంగా ఈ పుస్తకంలో ముందు ముందు విశదీకరిస్తాను.

సూత్రము 1- అ కు హ విసర్జనీయానాం కంఠః
సూత్రము 2- ఇ చు య శానాం తాలు
సూత్రము 3- ఋ టు ర షాణాం మూర్ధాః
సూత్రము 4- ఌ తు ల సానాం దన్త్యాః
సూత్రము 5- ఉపూ ఉపధ్మనీయా  నాం ఓష్ఠా :
సూత్రము 6 - ఞ మ ఙ ణ న నాం నాసికాచ
సూత్రము 7-  నాసికా అనుస్వారస్య
సూత్రము 8 - జిహ్వా మూలీయస్య జిహ్వా మూలం
సూత్రము 9-  ఏ  దై తోః కంఠ తాలు
సూత్రము 10-  ఓ దౌ తోః ఠోఽష్ఠం
సూత్రము 11-  వ కారస్య దంతోష్ఠం
సూత్రము 12-   యత్నో ద్విధా - అభ్యంతరో బాహ్యశ్చ
సూత్రము 13-
ఆద్యః అభ్యంతర ప్రయత్నాని  పఞ్చధా|
స్పృష్ట ఈషత్ స్పృష్ట వివృత సంవృత భేదాత్ |
తత్ర స్పృష్ట  ప్రయత్నానాం స్పర్శానాం |
ఈషత్ స్పృష్టం అంతస్థానాం | ఈషత్ వివృతమ్ ఊష్మాణామ్ |
వివృతమ్ స్వరాణాం | హ్రస్వ వర్ణస్య ప్రయోగే సంవృతమ్ ప్రక్రియా
దశాయాంతు వివృతమేవ |
అచః స్వరాః
అం అః ఇత్యచాః
కాదయోమావసానాః స్పర్శాః
యణోఽఅంతస్థాః
శల్ ఊష్మాణః

సూత్రము 14-

బాహ్య ప్రయత్నస్త్వేకాదశధా | వివారః సంవారః శ్వాసో నాదో ఘోషో
అఘోషో అల్ప ప్రాణో మహా ప్రాణో ఉదాత్తో అనుదాత్తః స్వరితశ్చేతి||
ఖరో వివారా శ్వాసా అఘోషాశ్చ
హశస్సంవారా నాదా ఘోషశ్చ
వర్గాణాం ప్రథమ తృతీయ పఞ్చమా యణశ్చల్పప్రాణః
వర్గాణాం ద్వితీయ చతుర్థౌ శలశ్చ మహాప్రాణః
ఉచ్చైరుదాత్తః |  నీచైరనుదాత్తః | సమాహారః స్వరితః

# అచ్చులు హల్లులు అనే పదాల పుట్టు పూర్వోత్తరాలు

పాణిని సంస్కృత వ్యాకరణము - మహేశ్వర సూత్రములు :

పాణిని మహర్షికి శ్రీ పరమేశ్వరుని ఢమరుక నాదముతో బోధించిన మహేశ్వర సూత్రాలు 'అష్టాధ్యాయి అనే సంస్కృత వ్యాకరణానికి మూలం.

ఇవి 14 సూత్రాలు :

అ ఇ ఉ ణ్ - 1
ఋ ఌ క్ - 2
ఏ ఓ ఙ్ - 3
ఐ ఔ చ్ - 4
హ య వ ర ట్ - 5
లణ్ - 6
ఞ మ ఙ ణ న మ్ -7
ఝ భ ఞ్ - 8
ఘ ఢ ధ ష్ - 9
జ బ గ డ ద శ్ -10
ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ -11
క ప య్ -12
శ ష స ర్ -13
హల్ -14

ప్రతి సూత్రము చివరి పొల్లును "ఇత్" అంటారు. దీన్ని కేవలము ఒక "డీలిమిటర్" గా వాడుతారు. ఉదాహరణకు ప్రత్యాహారం "అణ్" అంటే "అ నుండి ణ్" వరకు 'ణ్' మినహాయించి ఉన్నఅక్షరములు, అంటే "అ, ఇ, ఉ" లు.

ఇపుడు 'అచ్' అంటే చూద్దాం. మొదటి సూత్రము లోని 'అ' తో మొదలై '4 వ సూత్రము లోని చివరి 'చ్' మధ్య గల అక్షరములు. అంటే అచ్చంగా అచ్చులే. 1 నుండి 4 వ సూత్రము వరకు ఉన్న

వర్ణాలని అచ్ ప్రత్యాహారము ద్వారా సంస్కృత వ్యాకరణ సూత్రాలలో వాడుతారు. దీన్నే అచ్చులుగా తెలుగు స్వరములకి పేరు పెట్టారు. ( అచః స్వరాః )

అ ఇ ఉ ణ్ - 1
ఋ ఌ క్ - 2
ఏ ఓ ఙ్ - 3
ఐ ఔ చ్ - 4

అలాగే "హల్" అంటే 5 వ సూత్రము మొదటి అక్షరమునుండి 14 వ సూత్రపు చివరి 'ల్' వరకు గల 'హల్లులు". 5 నుండి 14 వ సూత్రము వరకు ఉన్న వర్ణాలని హల్ ప్రత్యాహారము ద్వారా సంస్కృత వ్యాకరణ సూత్రాలలో వాడుతారు. దీన్నే హల్లులుగా తెలుగు వ్యంజనములకు పేరు పెట్టారు.

హ య వ ర ట్ - 5
లణ్ - 6
ఞ మ ఙ ణ న మ్ -7
ఝ భ ఞ్ - 8
ఘ ఢ ధ ష్ - 9
జ బ గ డ ద శ్ -10
ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ -11
క ప య్ -12
శ ష స ర్ -13
హల్ -14

ఈ అక్షరములను అనేక ఇతర సూత్రాల ఆధారంగా దీర్ఘాక్షరములు, అనునాసికలు, గుణింతాలు, సంధించిన సంయుక్తాక్షరములతో భాషా విశ్వరూపం చూపబడింది.

"కంప్యూటర్ సైన్స్ రికార్డ్ డీలిమిటర్" వంటి అనేక అంశాలను, ఈ ప్రత్యాహారాలనుపయోగించి చిన్న చిన్న ఫ్మార్ములే లాంటి భాషా సూత్రాల రూపంలో, నేటి కంప్యూటర్ యుగపు మేధావులు, ముక్కున వేలేసుకొనే విధంగా "పాణిని మహర్షి" , 2500 సంవత్సరములకు పూర్వమే, గొప్ప భాషా శాస్త్రాన్ని తయారు చేసారు.

# శబ్ద శాస్త్రమునకు చెందిన సాంకేతిక పదాల వివరణలు

మనం శబ్ద శాస్త్ర విషయంలోకి వెళ్ళేముందు మరియు అక్షర అమృతం గ్రోలే ముందు , ఆ శబ్ద శాస్త్రమునకు చెందిన కొన్ని సాంకేతిక పదాలు మరియు విషయాలు అర్థం చేసుకోవాలి.

**సూత్రము :**
పెద్ద విషయాన్ని చిన్న సూత్రాలలో సులభంగా చెప్పారు మన పూర్వీకులు.
అల్పాక్షరం అసందిగ్ధం సారవత్ విశ్వతో ముఖమ్ |
అస్తోభం అనవద్యం చ సూత్రం సూత్ర విదో విదుః ||

సంజ్ఞ
"సంజ్ఞ" అంటే శబ్ద శాస్త్రమునకు చెందిన గుర్తులని అర్థం.

వర్ణము : ఒక సారి ఉచ్చరించడానికి వీలైన శబ్దాన్ని
"వర్ణము" అన్నారు
ఉదా: క్ , అ ;

వర్ణ సమామ్నాయము : వర్ణాల సముదాయము . సంస్కృతము యొక్క 50 మరియు 6 తెనుగుకి చెందిన వర్ణాలు కలిపి 56 అక్షరాలతో ఏర్పాటైన ఘనమైనది తెనుగు వర్ణ మాల .

వీటిలో స్వరములు/ప్రాణములు/అచ్చులు మరియు వ్యంజనములు/ప్రాణులు/హల్లులు అని రెండు రకములు.

**అచ్చులు/స్వరములు**: స్వయంగా పలుక బడేవి స్వరములు (స్వయం రంజయతి ఇతి స్వరం). వీటినే పాణిని వ్యాకరణ సూత్రాలననుసరించి అచ్చులు అన్నారు. వీటినే ప్రాణములు అని కూడా అంటారు.
సంకీర్ణ స్వరములు:
ఔ

**అచ్చులు**
**అ ఆ ఇ ఈ ఉ ఊ**
**ఋ ౠ ఌ ౡ**
**ఎ ఏ ఐ**
**ఒ ఓ ఔ**

అచ్చులను ఉచ్చము గా పలకటము ఉదాత్తము.
అచ్చులను క్రిందకు పలకటము అనుదాత్తము .
అచ్చులను సమముగా పలకటము స్వరితము .

## హల్లులు లేదా వ్యంజనములు:

నోటిలో పలు స్థానలలో ఉత్పత్తి అయిన శబ్దాలు అచ్చులు ఆధారము చేసుకొని ఉచ్చరింపబడుతవి. ఇవే వ్యంజనములు. వీటినే పాణిని వ్యాకరణ సూత్రాలననుసరించి హల్లులు అన్నారు. వీటినే సహాయకారులు లేదా ప్రాణులు అని కూడా అంటారు.

**హల్లులు**
**క ఖ గ ఘ ఙ**
**చ ఛ జ ఝ ఞ**
**ట ఠ డ ఢ ణ**
**త థ ద ధ న**
**ప ఫ బ భ మ**
**య ర ల వ**
**శ ష స హ**
**ళ ఱ క్ష**

**మాత్ర:** ఒక శబ్దము ఉచ్చరించే సమయాన్ని మాత్ర అంటారు. సాధారణముగా ఒక మాత్ర ఒక హ్రస్వపు అచ్చు 'అ', 'ఇ' 'ఉ' 'ఎ', 'ఒ' పలికే సమయం. కనుక హ్రస్వమంటే ఒక మాత్ర, దీర్ఘమంటే రెండు మాత్రలు, ప్లుతమంటే మూడు మాత్రలు. పొల్లుతో కూడిన హల్లులు అర్థ మాత్ర.

హ్రస్వము /లఘువు - ఒక మాత్రా కాలము
దీర్ఘము /గురువు - రెండు మాత్రల కాలము
ప్లుతము - మూడు మాత్రల కాలము

మాత్ర/ఉచ్చరించే సమయం మన అచ్చుల అమరిక వెనుక ఉన్న ఒక అంశము.

**ఉభయాక్షరములు:**
**అర్ధ మాత్ర కన్న తక్కువ సమయంలో ఉండటం చేత స్వయంగా పలుకబడలేనివి, కానీ ఇవి హల్లు లేదా అచ్చుల తో కలిసి ప్రయోగించబడుతవి.**

**ఉభయాక్షరమలు**

**ఁ ం ః**

**షండాక్షరములు - ఋ మరియు ఌ :**

ఇవి వ్యంజనములూ (హల్లులు) కాదు స్వరములూ(అచ్చులు) కావు. కానీ వ్యాకరణ సుత్రాల కొరకు, శబ్దోత్పత్తి ని తెలియ పరచడానికి అచ్చులలో చేర్చాలి.

ఌ, త వర్గము, ల , స దంత్యములు. అచ్చులలో ఉండి 'ఌ' ఆ వర్గానికి ప్రతినిధిగా వ్యవహరిస్తుంది. అంతే కాక వ్యాకరణ సూత్రాలలో కూడా దీని అవసరం ఉంది.

ఋ, ట వర్గము, ర , ష మూర్ధన్యములు. అచ్చులలో ఉండి 'ఋ' ఆ వర్గానికి ప్రతినిధిగా వ్యవహరిస్తుంది. అంతే కాక వ్యాకరణ సూత్రాలలో కూడా దీని అవసరం ఉంది.

**సంయుక్తాక్షరములు:**

**రెండు లేదా అంతకన్న ఎక్కువ అక్షరములు కలిసినపుడు ఏర్పడునవి. అక్షర మాల పూర్తిగా నేర్చిన తర్వాత సంధి ప్రకరణము, పదములు మొదలు పెట్టుట కొరకు అక్షర మాల చివర చూపించబడుతాయి. క్ష, త్ర , జ్ఞ** 'అ ' తో మొదలై 'క్ష ' తో సంపూర్ణమయ్యేవి అక్షరాలు. రెంటికి మించిన శబ్దాల సంకీర్ణతే గుణింతము. క్, ష్, అ మూల మాతృకల సమాగమమే క్+ష్+అ=క్ష. " **సంయుక్తాక్షరములు** సూచన ప్రాయంగా అక్షరముల సమాప్తాన్ని

మరియు వాటి కలయికకు లేదా గుణింతపు మరియు సంధి ప్రక్రియలకు చెందిన సూత్రాలు తెలిపే ఒక నాందిగా చెప్పవచ్చు. తెలుగు వారు మరిన్ని ఉదాహరణలివ్వాలనే ఉద్దేశ్యముతో త్ర, ఙ్ఞ లను కూడా నేర్పుతారు. ఇక్కడ రెండు అనునాసికల సంకీర్ణత మరియు రేఫ (ర వత్తు) తో సంయోగములను సూచిస్తున్నారు.

**గుణింతాలు:**

గుణింతము అంటే హల్లులను అచ్చులతో గుణించడమే.

{క్} X {అ, ఆ, ఇ , ఈ ఉ, ...అం}= { క, కా, కి, కీ, కు.....కం}

హల్లులు X అచ్చులు = గుణింతములు



ఇది గణిత శాస్త్రపు కార్టీసియన్ ప్రోడక్ట్ వంటిది, కానీ ఈ ఆవిష్కరణ "కార్టీసియన్ " కన్న ప్రాచీనమైనది.

**బలము:** శబ్దము ఉత్పత్తి చేయడానికి జరిగే ప్రయత్నాన్ని బలము అంటారు. సాధారణంగా శబ్దము ఉత్పత్తి చేసేటపుడు మరో అంగాన్ని/ప్రదేశాన్ని స్పర్శించడం, స్పర్శించకనే ఒత్తిడి చేయడం జరుగుతుంది. దీన్ని ప్రయత్నము అంటారు.

ఇది రెండు రకాలు.

1. అభ్యంతర ప్రయత్నము
2. బాహ్య ప్రయత్నము

సాధారణంగా శబ్ద ఉత్పత్తిని గ్రహించాలంటే పొల్లుతో కూడిన హల్లులను ప్రయత్నించాలి. అపుడు మనం స్పష్టంగా గ్రహించగలం. ఉదాహరణకి: హల్లు 'ప' యొక్క పొల్లు 'ప్'.



**అభ్యంతర ప్రయత్నము :**

చిత్రంలో గొంతుక నుంచి, నోరు లోపల, పెదిమలు మరియు ముక్కు వరకు జరిగే ప్రయత్నాలను అభ్యంతర ప్రయత్నము అంటారు.

అభ్యంతర ప్రయత్నము ఈ అయిదు రకాలు:
స్పృష్ట, ఈషత్ స్పృష్ట , వివృత , ఈషత్ వివృత , సంవృత

అభ్యంతర ప్రయత్నము గురించి తెలుసుకోవాలంటే ముఖ్యంగా రెండు అంశాలు తెలియాలి, అవి :
1. కరణము
2. స్థానము

**కరణము:** మనిషి నోరు లో శబ్దము ఉత్పత్తి చేయడానికి చలించే అంగాన్ని/ప్రదేశాన్ని "కరణము" అంటారు. నాలుక ఒక ప్రధానమైన కరణము. ఉదాహరణ కి "త థ ద ధ న" లను ఉచ్చరించేటపుడు నాలుక దంతాలని తన్నినట్లు స్పర్శిస్తే ఆ అక్షరములు వస్తాయి. ఒక సారి 'త్, థ్, ద్, ధ్, న్' లను ఏకాగ్రతతో పలికి పరిశీలించండి.

**స్థానము:** మనిషి నోరు లో శబ్దము ఉత్పత్తి చేయడానికి చలించక స్థిరముగా ఉండే అంగాన్ని/ప్రదేశాన్ని లేదా స్వల్పంగా చలించి స్పర్శించబడే ప్రదేశాన్ని "స్థానము" అంటారు. ఉదాహరణ కి "త థ ద ధ న" లను ఉచ్చరించేటపుడు నాలుక దంతాలని తన్నినట్లు స్పర్శిస్తే ఆ అక్షరములు వస్తాయి. కనుక ఇక్కడ దంతాలను "స్థానము" అంటారు. ఒక సారి 'త్, థ్, ద్, ధ్, న్' లను ఏకాగ్రతతో పలికి పరిశీలించండి.

**బాహ్య ప్రయత్నము:**

గొంతు, మరియు గొంతుకి క్రింది భాగములోని కృకాగ్రము, నాడీ తంత్రి, శ్వాస నాళాలు, ఊపిరి తిత్తుల ద్వారా జరిగే శబ్ద మార్పిడి ప్రయత్నములను బాహ్య ప్రయత్నము అంటారు. ఎందుకంటే ఇవి నోటి కన్న బాహ్యామైనవి (లేదా) బయలు ప్రదేశము లోనివి. బాహ్య ప్రయత్నాల కారణం గా ఉదాత్త- అనుదాత్త- స్వరిత, అల్ప ప్రాణ- మహా ప్రాణ, సంవార- వివార, శ్వాస- నాద, ఘోష- అఘోషములనే భిన్న భిన్న శబ్ద భేదాలు పుడుతాయి

# క చ ట త ప
# వర్గముల వెనుక రహస్యాలు

ఇక క , చ, ట, త , ప అని అయిదు వర్గాలు మీకు తెలిసినదే .

సముహము 1- క నుంచి ఙ వరకు
సముహము 2- చ నుంచి ఞ వరకు
సముహము 3- ట నుంచి ణ వరకు
సముహము 4- త నుంచి న వరకు
సముహము 5- ప నుంచి మ వరకు

సజాతీయ వర్గాలైన క చ ట త ప ల వెనుక రహస్యాలు:

ఇపుడు మొదటి వర్గము అయిన 'క వర్గాన్ని" మీరు అర్థం చేసుకోవాలంటే ఒక్క సారి మీరు "ఖ ఖ" అని దగ్గి శబ్దము ఎక్కడ నుంచి వస్తోందో గమనించండి. గొంతు లేదా కంఠము నుంచి, కనుక క వర్గాన్ని "కంఠ్యాలు అన్నారు.

ఇక మనం నేరుగా 'ప' వర్గానికి వెళ్దాము.

ఒక సారి ప ప ప, బ బ బ, మ మ అనండి. ఎక్కడ నుంచి శబ్దం వస్తోందో గమనించారా? పెదాల ద్వారా .. కనుక వీటిని ఓష్ఠ్యాలు అన్నారు.

మధ్య లోని... చ వర్గము పలికేటపుడు, నాలిక వెనక్కి తగ్గి దవడల వద్ద ఒదిగి పోతుంది, కనుక ఇవి తాలవ్యాలు.

ట వర్గము పలికేటపుడు, నాలిక పైకి నిలబడి మాడు భాగం వైపు తాకబడుతుంది. కనుక ఇవి మూర్ధన్యాలు.

త వర్గము పలికేటపుడు, నాలిక ముందుకి సాగి పళ్ళని తంతుంది, కనుక ఇవి దంత్యాలు.

**సూత్రము 1- అ కు హ విసర్జనీయానాం కంఠః :**
అ కు హ విసర్గలు కంఠ్యములు. అ, క వర్గము (క ఖ గ ఘ ఙ) , హ, విసర్గ కంఠ్యాలు (సూత్రములో కు అనగా క వర్గము)

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | | క | ఖ | గ | ఘ | ఙ | | హ | ః |




**సూత్రము 2- ఇ చు య శానాం తాలు :** ఇ చు య శ లు తాలువులు. ఇ, చ వర్గము (చ ఛ జ ఝ ఞ) , య, శ, తాలువులు, అనగా దవడను విస్తరించి పలుకునవి.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఇ | | చ | ఛ | జ | ఝ | ఞ | య | శ | |



**సూత్రము 3- ఋ టు ర షాణాం మూర్ధాః :** ఋ టు ర ష లు మూర్ధన్యములు . ఋ, ట వర్గము (ట ఠ డ ఢ ణ) , ర, ష మూర్ధన్యాక్షరములు - అనగా నాలుకను మాడు వైపుకు పైకి పెట్టి పలుక వలసినవి.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఋ | | ట | ఠ | డ | ఢ | ణ | ర | ష | |




**సూత్రము 4- ఌ తు ల సానాం దన్త్యాః** : ఌ తు ల స లు దంత్యములు . ఌ, త వర్గము (త థ ద ధ న) , ల, స దంత్యములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఌ | | త | థ | ద | ధ | న | ల | స | |



## సూత్రము 5- ఉపూ ఉపధ్మనీయా నాం ఓష్ఠౌ :

ఉ పు ఉపధ్మనీయములు ఓష్ఠములు . ఉ, ప వర్గము (ప ఫ బ భ మ) ఉపధ్మలు పెదవులననుసరించి పలుకునవి. (ఉపధ్మల అవసరం వైదిక పద కోశంలో వస్తుంది, సమయాభావము వలన ఇక్కడ చర్చించుట లేదు)

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఉ | | ప | ఫ | బ | భ | మ | | | ం |



# అనునాసికల పుట్టుక - వాడకంలో వాటి సహజత్వము

### సూత్రము 6 - ఞ మ ఙ ణ న నాం నాసికాచ :

క చ ట త ప వర్గముల చివర వచ్చు ఙ, ఞ, ణ, న, మ లు ముక్కుతో పలుకబడునవి అని ఈ సూత్రము అర్థము.

| |
|---|
| ఙ |
| ఞ |
| ణ |
| న |
| మ |

1. 'గ' ను ముక్కుతో పలికితే 'ఙ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.
2. 'జ' ను ముక్కుతో పలికితే 'ఞ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.
3. 'డ' ను ముక్కుతో పలికితే 'ణ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.
4. 'ద' ను ముక్కుతో పలికితే 'న' సహజంగా ఉత్పత్తి అవుతుంది.
5. 'బ' ను ముక్కుతో పలికితే 'మ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.

### సూత్రము 7- నాసికా అనుస్వారస్య :

పూర్ణ బిందువు లేదా పూర్ణానుస్వారమును ముక్కుతో పలకవలెను.

ఇలాగ వైజ్ఞానికముగా ఏర్పరచడము జరిగినది. అంతే కాక, ఒక వర్గములోని వర్ణానికి ముందు అచ్చుతో కలిసిన అనుస్వారము (పూర్ణబిందువు లేదా సున్న) వస్తే వర్గము చివరి ఉన్న అనునాసికలా అతి సహజంగా పలుకబడుతుంది. క్రింది ఉదాహరణలు మీకోసం-

క వర్గ ఉదాహరణ :- అంకము=అఙ్కము, అంగము = అఙ్గము
చ వర్గ ఉదాహరణ:- రాయంచ=రాయఞ్చ, అంజలి = అఞ్జలి
ట వర్గ ఉదాహరణ :- వంట=వణ్ట, అండము = అణ్డము
త వర్గ ఉదాహరణ :- బొంత=బొన్త , అందము = అన్దము
ప వర్గ ఉదాహరణ :- పంప=పమ్ప, అంబ = అమ్బ

పై సూత్రములు క్రింది సజాతీయ వరుసలను తయారు చేస్తాయి.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | | క | ఖ | గ | ఘ | ఙ | | హ | ః |
| ఇ | | చ | ఛ | జ | ఝ | ఞ | య | శ | |
| ఋ | | ట | ఠ | డ | ఢ | ణ | ర | ష | |
| ఌ | | త | థ | ద | ధ | న | ల | స | |
| ఉ | | ప | ఫ | బ | భ | మ | | | ం |



# సంకీర్ణ అక్షరములు - అక్షర మాల విశ్వరూపం:

భాషా వైవిధ్యము కు ఆలంబన మన సంకీర్ణ అక్షరములు. ఏ అక్షరమును ఉచ్చరించునపుడు, ఒకటికి మించిన శబ్ధోత్పత్తి స్థానములను వాడుతామో వాటిని సంకీర్ణ అక్షరములని చెప్పవచ్చు. క్రింది సూత్రములు వివిధ సంకీర్ణ అక్షరములగూర్చి వివరిస్తాయి.

**సూత్రము 8- ఏ దై తోః కంఠ తాలు** : ఎ, ఏ, ఐ ఉత్పత్తిలో కంఠము , దవడలు కలిపి ప్రయోగించాలి, కనుక ఇవి సంకీర్ణములు.

**సూత్రము 9- ఒ దౌ తోః రోఒష్ఠం:** ఒ ఓ ఔ ఉత్పత్తిలో కంఠము , పెదవులు కలిపి ప్రయోగించాలి, కనుక ఇవి సంకీర్ణములు.

**సూత్రము 10- వ కారస్య దంతోష్ఠం** : వ కారము ఉచ్చరించాలంటే దంతము పెదవి కలబడును. కనుక దీన్ని దంతోష్ఠమ్ అన్నారు. ఇదే కోవకు చెందినది ఫ్హార్సి లో వాడే 'ఫ఼' (fa) ఇది ఫ (pha) కు భిన్నమైనది. 'ఫ' ఉచ్చారణలో కేవలము పెదవులు వాడబడాలి, ఫ్హార్సి లో వాడే ' ఫ఼ ' ఉచ్చరించడానికి పై పెదవి క్రింది పళ్ళ వరుస కలిపి వాడాలి. ఉదాహరణ "ఫలము" ను "ఫ఼లము" అని తప్పుగా పలకటము మనకెరుకే.

చే జే ల ప్రయోగములో దవడలు, దంతములు కలిపి వాడాలి. ఇవి కేవలము తాలవ్యములైన చ జ లకు భిన్నమైనవి. అందుకే మీరు గమనిస్తే, చే జే ల పైన 'త' వత్తు పెట్టి 'దంతము యొక్క వర్గము-త" లక్షణముతో ఉచ్చరించమని సూచన గా తెలిపారు మేధావులైన మన ప్రాచీన తెలుగు భాషావేత్తలు. వీటిని t, d లకు ఆంగ్ల ఫోనెటిక్స్ లో ఉచ్చరించబడే tcha, dja లకు సమాంతరముగా కూడా ఉపయోగించుకొనవచ్చు. .

ళ ఱ ఴ లు తాలు మూర్ధన్యములు. సరళ, మఱ్ఱి ఇవేకాక తమిళ భాషలో వాడే "ఴ" ను కూడా మనము మన వర్ణమాలలో వ్రాయ వచ్చు, వాడుకొనవచ్చు ఉదాహరణ "పఴమ్" .

ఇదే విధముగా, ఫ్హార్సి లో వాడే ఖ్హ (ఖ్హాన్) ను జిహ్వామూలీయములం కోవలోనిది. అనగా విసర్గ ముందు కల ఖ్హ = ఃఖ+ ఆ . ఇదీ తెలుగులో ఫ్హార్సీ ఉరుదూ పద ప్రయోగాల్లో ఖచ్చితత్వానికి వాడవచ్చు.

ఇలా మన అక్షరముల సూత్రములనాధారము చేసుకొని ప్రపంచ భాషలు, ముఖ్యముగా మనము నిత్య జీవితములో వాడే పర భాషా పదాలు, మాండలికాలకు ఆలంబనగా వాడి వాటి మూలాలు కాపాడుకొనవచ్చునని నా పరిశోధనలో తేలిన సత్యము. సంస్కృత భాషా సూత్రాల ఆధారముగా తయారైన ఈ మహా అక్షర లిపి ని నేను విద్యార్థులకు నేరిపించడము జరుగుతోంది. ఈ సంస్కృత శబ్ద శాస్త్రపు సూత్రాలే ఒకప్పుడు IPA వారి ఆలోచనలుద్భవించడానికి మూల కారణం.

తెలుగు వారి అర్ధ సున్న ప్రత్యేకత:

తెలుగు వారికి సొంతమైన అర్ధానుస్వరమును/అర సున్నమన పూర్వీకుల భాషా ప్రఙ్ఞ కు ఒక నిదర్శనము. పూర్తి సున్న వ్రాసినా వ్రాయకపోయినా అర్థముమారనపుడు అర్ధ సున్నను ప్రయోగించవచ్చు. ఉదాహరణకు "అడగవచ్చు" లేదా "అడంగవచ్చు" రెండూ సరియైనవయినప్పుడు, దాన్ని సూచించడానికి అడఁగవచ్చు అని వ్రాయటము జరుగుతోంది. అచ్చుతో కలిసిన అర్ధానుస్వరము వస్తే అనునాసికలా పలుకబడుతుంది ప్రాచీన తెలుఁగు భాషా వేత్తల, కవుల భాషా ప్రమాణాల నాణ్యత కు, నిర్దిష్టతకు ఇది ఒక ఉదాహరణ.

క్ష ద్వారా చెప్పేదేమిటి?

'అ ' తో మొదలై 'క్ష ' తో సంపూర్ణమయ్యేవి అక్షరాలు. రెంటికి మించిన శబ్దాల సంకీర్ణతే గుణింతము. క్, ష్, అ మూల మాతృకల సమాగమమే క్+ష్+అ=క్ష. " క్ష " సూచన ప్రాయంగా అక్షరముల సమాప్తాన్ని మరియు వాటి కలయికకు లేదా గుణింతపు మరియు సంధి ప్రక్రియలకు చెందిన సూత్రాలు తెలిపే ఒక నాందిగా చెప్పవచ్చు. తెలుగు వారు మరిన్ని ఉదాహరణలివ్వాలనే ఉద్దేశ్యముతో త్ర, ఙ్ఞ లను కూడా నేర్పుతారు. ఇక్కడ రెండు అనునాసికల సంకీర్ణత మరియు రేఫ (ర వత్తు) తో సంయోగములను సూచిస్తున్నారు.

# మహా త్రిలింగ లిపి/పెను తెనుగు వ్రాలు

ఎన్నో భాషల శబ్దాలకాటపట్టైయిన మన తెలుగు అక్షరాల పట్టిక - "మహా త్రిలింగ లిపి/పెను తెనుగు వ్రాలు".

పై అక్షరముల పట్టికను "మహా త్రిలింగ/తెనుగు/తెలుగు లిపి" అని గానీ, "దొడ్డ/పెను తెనుగు వ్రాలు" అని గానీ, "తెలుగు కలగలుపు లిపి" అని గానీ , "తెలుగక్షరాల పెద్ద పట్టి" అని గానీ నేను ముద్దు గా పిలిచుకొని, విద్యార్థులకు నేర్పించడము జరుగుతున్నది

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ఆ | క | ఖ | గ | ఘ | ఙ | | హ | ః |
| ఇ | ఈ | చ | ఛ | జ | ఝ | ఞ | య | శ | |
| | | ౘ | | ౙ | | | | | |
| ఋ | ౠ | ట | ఠ | డ | ఢ | ణ | ర | ష | |
| | | | | | | | ౚ | | |
| | | | | | | | ళ | | |
| | | | | | | | ఱ | | |
| ఌ | ౡ | త | థ | ద | ధ | న | ల | స | |
| ఉ | ఊ | ప | ఫ | బ | భ | మ | | | |
| ఎ | ఏ | | | | | | | | |
| ఐ | | | | | | | | | |
| ఒ | ఓ | | | | | | | | |
| ఔ | | | | | | | | | |
| అం | | | | | | | | | |
| అఁ | | | | | | | | | |
| | | వ | ఫ్ట | | | | | | |
| | | | ఖ్ట | | | | | | |
| | | | | | | | త్ర | జ్ఞ | క్ష |

# సంహిత-సంయోగము- సంధి

సంహిత, సంయోగము, సంధి ఇవన్నీ అచ్చు మరో అచ్చుతో గానీ, అచ్చు హల్లు తో గానీ కలిసినపుడి ఏర్పడే జరిగే శబ్ద ప్రక్రియలు. దీని కారణంగా మనకు అచ్చుల వరుస ,మరియు గుణింతాలు , సంయుక్తాక్షరములు ఏర్పడుతాయి.

రెండు అక్షరములు ముఖ్యంగా అచ్చులు కలిస్తే సహజంగా నోటిలో ఎలాంటి శబ్దాలు బహిర్గతమవుతాయి మొదలైన అనేక విషయాల మీద అతి నిగూఢంగా పరిశోధన మరియు పరిశీలన చేసారు మన ప్రాచీన భాషా వేత్తలు. వారు గమనించినవి కొన్ని-

లోపం - లుప్తమయిపోవడమ్
ఆదేశం - మార్పు అవడం
ప్రకృతిభావ - లోపము ఆదేశము లేక పోవడము

**అచ్చుల క్రమము:** ఈ పరిశోధనల ఆధారంగా అక్షర సంధి నియమాలను మరియు మన అచ్చుల క్రమమును ఏర్పరిచారు.

అచ్చు + అచ్చు = అ + అ = ఆ, అ+ ఇ = ఐ

శబ్ద ప్రయత్నము చేయునపుడు ఒకే స్థానము మాత్రమే ఉపయోగించితే పుట్టిన అచ్చులు:

**అ, ఆ (అ+అ) , ఇ , ఈ (ఇ+ఇ), ఉ , ఊ (ఉ+ఉ) -**

శబ్ద ప్రయత్నము చేయునపుడు ఒకటి కన్న ఎక్కువ స్థానములు ఉపయోగించితే పుట్టిన అచ్చులు.

**ఎ ,ఏ ,ఐ (ఏ +అ)**
**ఒ,ఓ ,ఔ (ఓ+ఉ)**

పూర్ణానుస్వార, అర్ధానుస్వార, విసర్గలు:

**అం , అఁ , అః**

# గుణింతాలలో గణితము

అక్షర సంధి నియమాల ఆధారంగా గుణింతాలను ఏర్పరిచారు. ఉదాహరణకి గుణింతాల అక్షర సంధులు-

పొల్లుతో కూడిన హల్లు + హ్రస్వ అచ్చు = క్ + ఇ = కి
పొల్లుతో కూడిన హల్లు + దీర్ఘ అచ్చు = క్ + ఆ = కా
పొల్లుతో కూడిన హల్లు+ పొల్లుతో కూడని మరొక హల్లు = క్ + వ = క్వ

**శ్రామిక =**శ + ్ + ర + ా ; మి= మ్ + ఇ = మ్ + ి ;క=క్+అ

అచ్చులను, హల్లులు అనే వర్ణాలతో గుణిమ్చుటము (cartesian product (or) అచ్చులు Cross హల్లులు) వలన గుణింతాలు ఏర్పడ్డాయి .

{క్} X {అ, ఆ, ఇ , ఈ ఉ, ...అం}= { క, కా, కి, కీ, కు.....కం}




హల్లులు X అచ్చులు = గుణింతములు

ఇది గణిత శాస్త్రపు కార్టీసియన్ ప్రోడక్ట్ వంటిది, కానీ ఈ ఆవిష్కరణ "కార్టీసియన్ " కన్న ప్రాచీనమైనది.

క్ ఖ్ గ్ ఘ్ -----+అ= --------} క ఖ గ ఘ జ

చ్ ఛ్ జ్ ఝ్ ----+అ=---} చ ఛ జ ఝ ఞ

ఇది గణిత శాస్త్రపు కార్టీసియన్ ప్రోడక్ట్ వంటిది, కానీ ఈ ఆవిష్కరణల కన్న ప్రాచీనమైనది.

**గుణింత చిహ్నాలు -కొన్ని లిపి గుర్తుల పేర్లు:**





**్ =** హలంత్యము లేదా పొల్లు - హల్లు యొక్క అసలు స్వరూపము
తల కట్టు - అ కారము యొక్క సంజ్ఞ - క్ + అ = క (తలకట్టు)
**ా** దీర్ఘము - ఆ కారము యొక్క సంజ్ఞ - క్ + ఆ = కా (దీర్ఘము)
**ి గుడి** క్+ఇ= కి
**ీ గుడి దీర్ఘము**
ు **కొమ్ము** క్+ఉ=కు
ూ **కొమ్ము దీర్ఘము**
ృ క్+ఋ= కృ వటృసుడి
క్+ౠ= కౄ = లృకారము

ె ఎ ఎత్వము
ే ఏత్వము
ై ఐత్వము

ొ ఒత్వము
ో ఓ త్వము

ౌ ఔత్వము
పూర్ణానుస్వారము ం
అర్ధానుస్వారము ఁ
విసర్గ ః

క కా కి కీ కు కూ కృ కౄ కె కే కై కొ కో కౌ కం కః
ఖ ఖా ఖి ఖీ ఖు ఖూ ఖృ ఖౄ ఖె ఖే ఖై ఖొ ఖో ఖౌ ఖం ఖః

## శబ్ద ప్రయత్నము:

సాధారణంగా శబ్దము ఉత్పత్తి చేసేటపుడు మరో అంగాన్ని/ప్రదేశాన్ని స్పర్శించడం, స్పర్శించకనే ఒత్తిడి చేయడం జరుగుతుంది. దీన్ని ప్రయత్నము అంటారు. సాధారణంగా శబ్ద ఉత్పత్తిని గ్రహించాలంటే పొల్లుతో కూడిన హల్లులను ప్రయత్నించాలి. అపుడు మనం స్పష్టంగా గ్రహించగలం.




ఉదాహరణకి: హల్లు 'ప' యొక్క పొల్లు 'ప్'.

యత్నో ద్విధా - అభ్యంతరో బాహ్యశ్చ - అభ్యంతరము బాహ్యమని యత్నములు రెండు విధాలు.

1. అభ్యంతర ప్రయత్నము

2. బాహ్య ప్రయత్నము

ఆద్యః అభ్యంతర ప్రయత్నాని పఞ్చధా|
స్పృష్ట ఈషత్ స్పృష్ట వివృత సంవృత భేదాత్ |
తత్ర స్పృష్ట ప్రయత్నానాం స్పర్శానాం |
ఈషత్ స్పృష్టం అంతస్థానాం | ఈషత్ వివృతమ్ ఊష్మాణామ్ |
వివృతమ్ స్వరాణాం | హ్రస్వ వర్ణస్య ప్రయోగే సంవృతమ్ ప్రక్రియా దశాయాంతు వివృతమేవ |

బాహ్య ప్రయత్నస్త్వేకాదశధా | వివారః సంవారః శ్వాసో నాదో ఘోషోఅఘోషో అల్ప ప్రాణో మహా ప్రాణో ఉదాత్తో అనుదాత్తః స్వరితశ్చేతి||

ఇది అర్థము చేసుకోవాలంటే మొదట క్రింది చిత్రం లోని మనిషి వాక్ వ్యవస్థ/ శబ్దోత్పత్తి వ్యవస్థను పరిశీలించాలి.

చిత్రంలో గొంతుక నుంచి, నోరు లోపల, పెదిమలు మరియు ముక్కు వరకు జరిగే ప్రయత్నాలను **అభ్యంతర ప్రయత్నము** అంటారు.

# స్థానము- కరణము :

అభ్యంతర ప్రయత్నము గురించి తెలుసుకోవాలంటే ముఖంగా రెండు అంశాలు తెలియాలి, అవి : 1. కరణము, 2. స్థానము

**కరణము:** మనిషి నోరు లో శబ్దము ఉత్పత్తి చేయడానికి చలించే అంగాన్ని/ప్రదేశాన్ని "కరణము" అంటారు. నాలుక ఒక ప్రధానమైన కరణము. ఉదాహరణ కి "త థ ద ధ న" లను ఉచ్చరించేటపుడు నాలుక దంతాలని తన్నినట్లు స్పర్శిస్తే ఆ అక్షరములు వస్తాయి. ఒక సారి 'త్, థ్, ద్, ధ్, న్' లను ఏకాగ్రతతో పలికి పరిశీలించండి.

**స్థానము:** మనిషి నోరు లో శబ్దము ఉత్పత్తి చేయడానికి చలించక స్థిరముగా ఉండే అంగాన్ని/ప్రదేశాన్ని లేదా స్వల్పంగా చలించి స్పర్శించబడే ప్రదేశాన్ని "స్థానము" అంటారు. ఉదాహరణ కి "త థ ద ధ న" లను ఉచ్చరించేటపుడు నాలుక దంతాలని తన్నినట్లు స్పర్శిస్తే ఆ అక్షరములు వస్తాయి. కనుక ఇక్కడ దంతాలను "స్థానము" అంటారు. ఒక సారి 'త్, థ్, ద్, ధ్, న్' లను ఏకాగ్రతతో పలికి పరిశీలించండి.

మరి కొన్ని ఉదాహరణలు:

ప్ ఫ్ బ్ భ్ లు ఉచ్చరించేటపుడు "క్రింది పెదవి" ఒక కరణము, పై పెదవి ఒక స్థానము గా గ్రహిస్తారు.

క్ ఖ్ గ్ ఘ్ లకు - కంఠము స్థానము, హను మూలము (దవడల లోపలి భాగపు మూలము) కరణము.

సాధారణము గా "స్థానము" బట్టి, ఆ అక్షరముల గుంపుకి పేరు ఆపాదిస్తారు. ఉదాహరణకి, కి "త థ ద ధ న" వర్గము యొక్క "స్థానము" "దంతాలు" కనుక వీటిని "దంత్యాలు" అంటారు.

**అక్షర అభ్యాసం** - శబ్దోత్పత్తి స్థానము, కరణము గ్రహించడానికి కొన్ని సాధనాభ్యాసములు:

మీకు నాలుక లేకపోతే 'అ' ని ఎలా అంటారో ప్రయత్నించండి. ఆ శబ్దోత్పత్తి స్థానము గమనించండి. కంఠము/గొంతుక మూలం నుంచి అది ఏర్పడినట్లు గ్రహించ గలరు.

ఖ్, ఖ్ ఖ్ అని దగ్గి 'క్' లేదా 'ఖ్' శబ్దము ఎక్కడ నుంచి పుడుతోందో గ్రహించండి. కంఠము/గొంతుక మూలం నుంచి అది ఏర్పడినట్లు గ్రహించ గలరు.

త్, ,త్, త్ అంటూ 'త్' శబ్దము ఎక్కడ నుంచి పుడుతోందో గ్రహించండి. దంతములు స్థానము అని, నాలుక కరణమని గ్రహించ గలరు.

ప్,ప్,ప్ అంటూ 'ప్' శబ్దము ఎక్కడ నుంచి పుడుతోందో గ్రహించండి. పై పెదవి స్థానము అని, క్రింద పెదవి కరణమని గ్రహించ గలరు.

వ్, వ్, వ్ అంటూ 'వ్' శబ్దము ఎక్కడ నుంచి పుడుతోందో గ్రహించండి. పెదవి స్థానము అని, దంతముల వరుస కరణమని గ్రహించ గలరు.

## అభ్యంతర ప్రయత్నము:

మనము సాధారణంగా "అ - క చ ట త ప- య- శ" అనబడే వరుసలో అక్షరములు వ్రాస్తాము. అనగా మొదట, అ నుండి అః వరకు అచ్చులు, తర్వాత క, చ , ట, త, ప వర్గాలు వ్రాసి ; ఆపై "య ర ల వ" వర్గము, చివరిగా "శ ష స హ" వర్గము తో ముగిస్తాము.
అచః స్వరాః
కాదయోమావసానాః స్పర్శాః (క నుంచి మ వరకు)
యణోఽఅంతస్థాః (య నుంచి వ వరకు)
శల్ ఊష్మాణః (శ నుంచి హ వరకు)

ఈ విధానమునకు మూలము కరణము(కదిలే ఉపకరణ), స్థానము(కదలని ఉపకరణ) ఆధారముగా చేసుకుని జరిగే "అభ్యంతర ప్రయత్నము". ఈ కరణము స్థానము ఒక దాన్ని ఒకటి స్పర్శించబడుతున్నవా లేదా, ఎంత దూరములో ఒక దానికొకటి ఉన్నవి అనే దాని ఆధారముగా ఈ కూర్పు జరిగినది. ఉదాహరణకు "త థ ద ధ న" ఉచ్చరించునపుడు దంతాలు "స్థానము", నాలుక "కరణము" ." ప ఫ బ భ మ"ఉచ్చరించునపుడు పై పెదవి "స్థానము", క్రింది పెదవి "కరణము" . ఇవి ఒక దాన్ని ఒకటి స్పృశించుకొంటాయి. కనుక స్పర్శలు అన్నారు. క, చ, ట, త , ప వర్గులన్నీ స్పర్శలు. అలాగే "యరలవ" లు అంతస్థములు "శ ష స హ" లు ఊష్మలు

ఇవి "అభ్యంతర ప్రయత్నము" అనే విధానము ద్వారా వర్గీకరించబడ్డాయి.

అభ్యంతర ప్రయత్నము ఈ అయిదు రకాలు:

ఆద్యః అభ్యంతర ప్రయత్నాని పఞ్చధా| స్పృష్ట ఈషత్ స్పృష్ట వివృత సంవృత భేదాత్ |

**1. వివృతములు** - నోరు విస్తరించి పలుక వలసిన అక్షరముల గుంపు. విడిగా పలికే అచ్చులు వివృతములు. వివరించడం అనే తెలుగు పదం దీని నుంచే వచ్చింది, విస్తారము దీనికి సమాన అర్థం లో వాడుతారు.

**వివృతమ్ స్వరాణాం | హ్రస్వ వర్ణస్య ప్రయోగే సంవృతమ్ ప్రక్రియా దశాయాంతు వివృతమేవ |**

హ్రస్వ అచ్చులు మరో అక్షరములతో కలిసిపోతే సంవృతములు (నోరు విస్తరించి పలుక వలసిన అవసరము లేనివి)అయిపోతాయి. ప్రయత్నించి చూడండి.

**అక్షర అభ్యాసం -**

సంవృత , వివృతాల ను ఆకళింపు చేసుకోవడానికి కొన్ని సాధనాభ్యాసములు:

హ్రస్వ అచ్చులు ల పై ప్రయోగాలు :

అతి మెల్లగా 'అ' అని, అలాగే ఆపండి. నోరు తెరుచుకొని ఉన్నట్లు గమనించారా? దీన్నే 'వివృతము' అంటారు.

ఇపుడు, "అమ్మ" లో అ కారం పలికేటపుడు, నోరు విస్తారంగా తెరువబడదు. అందుకే హ్రస్వ అచ్చులు పనిలో (వేరే అక్షరములతో కలవడం మొదలైన..) ఉన్నపుడు సంవృతాలు.

**2. స్పర్శలు-** స్థానము మరియు కరణము ఒక దానితో ఒకటి తాక బడే అక్షరముల గుంపు (క, చ, ట , త , ప వర్గాక్షరములు ) ఈ వర్గానికి చెందినవి.

తత్ర స్పృష్ట ప్రయత్నానాం స్పర్శానాం |

**అక్షర అభ్యాసం -** స్పర్శల ను ఆకళింపు చేసుకోవడానికి కొన్ని సాధనాభ్యాసములు:

క, చ , ట, త ,ప , గ జ, డ, ద, బ లను ఒక్కొక్కటీ మెల్లగా ఉచ్చరించండి. స్థానము , కరణము ఒక దానికొకటి స్పర్శించుకొన్నపుడు శబ్దోత్పత్తి జరుగునని గ్రహించ గలరు.

**3. ఈషత్ స్పృష్టములు**- స్థానము మరియు కరణము ఒక దానితో ఒకటి తాకీ తాకని అక్షరముల గుంపు - అంతస్థములు (య, ర, ల , వ) ఈ వర్గానికి చెందినవి.
ఈషత్ స్పృష్టం అంతస్థానాం |

**అక్షర అభ్యాసం** - అంతస్థములు/ఈషత్ స్పృష్టముల ను ఆకళింపు చేసుకోవడానికి కొన్ని సాధనాభ్యాసములు:
య, ర, ల, వ లు పలుకునపుడు స్థానము , కరణములను ఏకాగ్రంగా గమనించండి. కరణము స్థానము పైన తాకీ తాకనట్లు వత్తిడి కలగ చేయడం వలన వీటిని ఈషత్ స్పృష్టములు అంటారని మీరు గ్రహించగలరు.

**4. ఈషత్ వివృతములు -** కొద్దిగా మాత్రమే నోరు విస్తరించి పలుక వలసిన అక్షరముల గుంపు- ఊష్మలు (శ, ష, స, హ) ఈ వర్గానికి చెందినవి.
ఈషత్ వివృతమ్ ఊష్మాణామ్ |

**అక్షర అభ్యాసం** - అంతస్థములు/వివృతముల ను ఆకళింపు చేసుకోవడానికి కొన్ని సాధనాభ్యాసములు:

ఆ, ఈ, ఊ అను నోరుని ఏకాగ్రంగా గమనించండి. ఆ, ఈ, ఊ అన్నపుడు నోరు స్వేచ్ఛగా ముందుకు సాగబడటం లేదా తెరువబడటం జరుగుతుంది. ఇపుడు, శ, ష, స, హ లు పలుకునపుడు నోరును ఏకాగ్రంగా గమనించండి. ఇక్కడ నోరు స్వేచ్ఛగా ముందుకు సాగబడటం లేదా తెరువబడటం జరుగక కొంచెం తెరిచీ తెరవబడనట్లు ప్రయత్నము జరుగుతుందని గమనించ గలరు. కనుకనే వీటిని ఈషత్ స్పృష్టములు అంటారని మీరు గ్రహించగలరు.

# బాహ్య ప్రయత్నము:

గొంతు, మరియు గొంతుకి క్రింది భాగములోని కృకాగ్రము, నాడీ తంత్రి, శ్వాస నాళాలు, ఊపిరి తిత్తుల ద్వార జరిగే శబ్ద మార్పిడి ప్రయత్నములను బాహ్య ప్రయత్నము అంటారు. ఎందుకంతే ఇవి నోటి కన్న బాహ్యమైనవి (లేదా) బయలు ప్రదేశము లోనివి. బాహ్య ప్రయత్నాల కారణం గా ఉదాత్త- అనుదాత్త- స్వరిత, అల్ప ప్రాణ- మహా ప్రాణ, సంవార- వివార, శ్వాస- నాద, ఘోష- అఘోషములనే భిన్న భిన్న శబ్ద భేదాలు పుడుతాయి.

క ఖ చ ఛ ట ఠ తథ ప ఫ ; శ ష స - వివార, శ్వాస, అఘోష
గ ఘ జ ఝ డ ఢ ద ధ బ భ ; హ య ర ల వ -సంవార, నాద, ఘోష

క చ ట త ప గ జ డ ద ; య ర ల వ - అల్ప ప్రాణాలు
ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ; శ ష స హ - మహా ప్రాణాలు

ఉదాహరణ:

**అల్ప ప్రాణము మహాప్రాణముల మధ్య తేడా :**

క - అల్ప ప్రాణము (ఉచ్చరించేటపుడు తక్కువ గాలి వదిలితే పలికబడే శబ్దము)
ఖ - మహా ప్రాణము (ఉచ్చరించేటపుడు అధికంగా గాలి వదిలితే పలికబడే శబ్దము)

**వివారము, సంవారము మధ్య తేడా :**

''క' పలికేటపుడు గొంతు రంధ్రము తగ్గించితే 'గ' ఏర్పడుతుంది.

కనుక 'క' వివారము (గొంతు రంధ్రము తగ్గించనిది) 'గ' సంవారము (గొంతు రంధ్రము తగ్గించి పలికేది).

ఇలా మన అక్షరములలో
'క' తర్వాత 'గ',
'చ' తర్వాత 'జ' ,
'ట' తర్వాత 'త',

'ప' తర్వాత 'బ'
అమర్చడానికి కూడా శాస్త్రీయత ఉంది.

**అక్షర అభ్యాసం -** బాహ్య ప్రయత్నాలను ఆకళింపు చేసుకోవడానికి కొన్ని సాధనాభ్యాసములు:

క చ, ట, త ,ప వర్గములు అభ్యాసము చేసి ఆ వరుసలలో వైజ్ఞానికతను (బాహ్య ప్రయత్నమును ) ఆకళింపు చేసుకోండి.

## క వరుస/వర్గము (క, ఖ, గ , ఘ, ఙ)

సంవారము-వివారము అభ్యాసములు:
క్ అని ఒక క్షణం ఆగి గ్ అనండి. ఈ అభ్యాసము వరుసగా అయిదు సార్లు చేయండి. దీని వలన సంవారము, వివారము (గొంతులో గాలి అపడమనే ప్రక్రియ) ను అర్థము చేసుకోగలము. క్, గ్ ల తేడా దీని ద్వారా ఏర్పడుతుంది.

అల్ప ప్రాణము, మహాప్రాణము అభ్యాసములు:
కొంతసేపు క్ క్ క్ లను సాధన చేయండి. తర్వాత ఖ్ ఖ్ ఖ్ లను సాధన చేసి, క్, ఖ్ శబ్దాల మధ్య తేడా గమనించండి.
'ఖ' బదులుగా 'క్క' పలుకే ప్రమాదం ఉండి. ఆ తేడా గమనించడం ముఖ్యం.

ఇలాగే గ్, ఘ్ ల సాధన చేయాలి.

అనునాసికము ల అభ్యాసము: ముక్కు మూసుకొని 'గ' ను ముక్కుతో పలికితే 'ఙ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.

## చ వర్గము (చ ఛ జ ఝ ఞ )

సంవారము-వివారము అభ్యాసములు:
చ్ అని ఒక క్షణం ఆగి జ్ అనండి. ఈ అభ్యాసము వరుసగా అయిదు సార్లు చేయండి. దీని వలన సంవారము, వివారము (గొంతులో గాలి అపడమనే ప్రక్రియ) ను అర్థము చేసుకోగలము. చ్, జ్ ల తేడా దీని ద్వారా ఏర్పడుతుంది.

అల్ప ప్రాణము, మహాప్రాణము అభ్యాసములు:
కొంతసేపు చ్,చ్,చ్ లను సాధన చేయండి. తర్వాత ఛ్ ఛ్ ఛ్ లను సాధన చేసి, చ్, ఛ్ శబ్దాల మధ్య తేడా గమనించండి.
'ఛ' బదులుగా 'చ్చ' పలుకే ప్రమాదం ఉండి. ఆ తేడా గమనించడం ముఖ్యం.

ఇలాగే జ ఝ ల సాధన చేయాలి.

ముక్కు మూసుకొని 'జ' ను పలికితే 'అనునాసికము ఞ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.

## ట వర్గము (ట ఠ డ ఢ ణ )

సంవారము-వివారము అభ్యాసములు:
ట్ అని ఒక క్షణం ఆగి డ్ అనండి. ఈ అభ్యాసము వరుసగా అయిదు సార్లు చేయండి. దీని వలన సంవారము, వివారము (గొంతులో గాలి అపడమనే ప్రక్రియ) ను అర్థము చేసుకోగలము. ట్, డ్ ల తేడా దీని ద్వారా ఏర్పడుతుంది.

అల్ప ప్రాణము, మహాప్రాణము అభ్యాసములు:
కొంతసేపు ట్ ట్ ట్ లను సాధన చేయండి. తర్వాత ఠ్ ఠ్ ఠ్ అంటూ సాధన చేసి, ట్, ఠ్ శబ్దాల మధ్య తేడా గమనించండి.
'ఠ' బదులుగా 'ట్ట' పలుకే ప్రమాదం ఉండి. ఆ తేడా గమనించడం ముఖ్యం.

ఇలాగే డ, ఢ ల సాధన చేయాలి.

ముక్కు మూసుకొని 'డ' ను పలికితే అనునాసికము 'ణ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.

## త వర్గము (త థ ద ధ న ):

సంవారము-వివారము అభ్యాసములు:
త్ అని ఒక క్షణం ఆగి ద్ అనండి. ఈ అభ్యాసము వరుసగా అయిదు సార్లు చేయండి. దీని వలన సంవారము, వివారము (గొంతులో గాలి

అపడమనే ప్రక్రియ) ను అర్థము చేసుకోగలము. త, ద ల తేడా దీని ద్వారా ఏర్పడుతుంది.

అల్ప ప్రాణము, మహాప్రాణము అభ్యాసములు:
కొంతసేపు ద్ ద్ ద్ లను సాధన చేయండి. తర్వాత ధ్ ధ్ ధ్ లను సాధన చేసి, ద్, ధ్ శబ్దాల మధ్య తేడా గమనించండి.
'ధ్' బదులుగా 'ద్ధ్' పలుకే ప్రమాదం ఉంది. ఆ తేడా గమనించడం ముఖ్యం.

ఇలాగే త్, థ్ ల సాధన చేయాలి. థ అంటే వత్తు త, "ధ" కాదు.

ఇక్కడ ఒక సూచన - తెలుగు వారు థ ను ఎందుకు ధ వలే పలుకుతారో కారణం చెబుతాను. లిపి తో చిన్న సమస్య ఇది. తెలుగు లిపి లో థ ధ ఒకే లా కంటికి కనిపిస్తాయి. కనుక అందరూ థ ని ధ గా ఉచ్ఛరిస్తారు. కానీ థ పలికేటపుడు, త ని మహాప్రాణంగా పలకాలి.

ముక్కు మూసుకొని 'ద' ను పలికితే అనునాసికము 'న' సహజంగా ఉత్పత్తి అవుతుంది.

## ప వర్గము (ప ఫ బ భ మ ):

సంవారము-వివారము అభ్యాసములు:
ప్ అని ఒక క్షణం ఆగి బ్ అనండి. ఈ అభ్యాసము వరుసగా అయిదు సార్లు చేయండి. దీని వలన సంవారము, వివారము (గొంతులో గాలి అపడమనే ప్రక్రియ) ను అర్థము చేసుకోగలము. ప్, బ్ ల తేడా దీని ద్వారా ఏర్పడుతుంది.

అల్ప ప్రాణము, మహాప్రాణము అభ్యాసములు:
కొంతసేపు బ్ బ్ బ్ లను సాధన చేయండి. తర్వాత భ్ భ్ భ్ లను సాధన చేసి, బ్, భ్ శబ్దాల మధ్య తేడా గమనించండి.
'బ' బదులుగా 'బ్బ' పలుకే ప్రమాదం ఉంది. ఆ తేడా గమనించడం ముఖ్యం.

ఇలాగే ప్, ఫ్ ల సాధన చేయాలి.

ఇక్కడ ఒక సూచన- ఫ బదులు ఫార్సీ 'ఫ़' పొరపాటుగా పలుకుతుంటాము. అవి రెండు విభిన్నమైనవి.

ఫ అనేది రెండు పెదవులు కలిపి పలకాలి, రెండు పెదాలూ బయటకు పగిలినట్లు విచ్చింపచేస్తే 'ఫ' వస్తుంది.

ఫలం అన్నపుడు దంతాలు వాడకుండా కేవలం పెదాలతో మాత్రమే'ఫ' అనాలి. (ఓష్ఠ్యమ్).

అదే పెదిమ కు దంతాల వరుస తాకించి గాలి బయటకు వదిలితే ఫ़ వస్తుంది. అంతే ఇది 'వ' వలే దంతోష్ఠ్యమ్ అన్నమాట.

ఫ़ాతిమా అన్నపుడు పర్షియన్ 'ఫ़' వాడాలి. (దంతోష్ఠ్యమ్ )

ముక్కు మూసుకొని 'బ' ను పలికితే అనునాసికము 'మ' సహజంగా ఉత్పత్తి అవుతుంది.

# అక్షర అభ్యాసంలో సందేహాలు- సమాధానాలు

## ఱ ళ లు ఎక్కడ నుంచి పలక బడుతాయి?

ర (లేదా రేఫ) అనేది నాలుక పైకి ఎత్తి పలికే మూర్ధన్యము. అదే ఱ పలకాలంటే దవడలు వెడల్పు చేసి, నాలుకను పంటికి మూర్ధన్యమునకు మధ్య భాగంలో వత్తి పలుమార్లు వేగంగా ర అనడానికి ప్రయత్నించాలి. అపుడు ఱ వ్యక్తమవుతుంది.కనుక ఇది మూర్ధన్యము కాదు. ఇది తాలు మూర్ధన్యము.

ల అనేది నాలుక దంతాలకు తగిలితే జనించే దంత్యము. కానీ ళ ఆ వర్గమునకు చెందినది కాదు. ఇది ర వలే నాలుక పైకి ఎత్తి పలికే మూర్ధన్యము. కానీ ర కి ళ కి తేడా ఏమిటంటే ళ ఉచ్చర్ంచేటపుడు నాలుక తిరగ తిప్పి మాడు వైపు తాకించాలి, అంతే కాక దవడలు వెడల్పు చేసి ఉంచాలి. "ర" కు దవడల వెడల్పు అవసరం లేదు మరియు నాలుకు నేరుగా మాడుని స్పృశిస్తుంది. కనుక ళ దంత్యముల వర్గమూ కాదు మూర్ధన్యమూ కాదు. ఇది "వ్యతిరిక్త తాలు మూర్ధన్యము". ఆంటే ఒకరకంగా "నాలుక తిరబెట్టి ఱ పలికలని ప్రయత్ని స్తే ళ జనిస్తుంది.

## చే , జే లు ఎక్కడ నుంచి పలక బడుతాయి? వీటి పైన గల త వత్తు ప్రత్యేకత ఏమిటి?

చే , జే లు తెలుగు వారి ప్రత్యేక అక్షరములు. వీటి పైన గలది 'త' వత్తు ఆని కొందరూ , మరికొందరు త వత్తు బదులు అది రెండు అంకె గుర్తు ఆనీ రెండవ చ జ అనీ కూడా అంటారు.....ఆవిషయం అటుంచి అయినా త వత్తు అనే దృష్టి తో గమ్మత్తు కలిగించే అంశము గ్రహిద్దాం. మన చ జ లు ఉచ్చరించేటపుడు దంతాలకు వత్తి పడితే చే , జే లు వస్తాయని, సంకేత రూపంలో చెబుతున్నారు. త వర్గము దంత్యాలు కనుక 'త ' వత్తు ని వీటి పైన ఉంచారు. ఒక్క సారి అలా ఉచ్చరించి చూడండి, మీకే తెలుస్తుంది, ప్రాచీన తెలుగు భాషా వేత్తల సునిశితమైన ఆలోచన, మేధా శక్తి . విలువ తెలియని వారు, అంత వైజ్ఞానిక దృక్పథము లేనివారు, చే , జే లను తెలుగు అక్షర మాల నుంచి తొలగించి భాషా హత్యకు పాల్పడుతున్నరనిపిస్తున్నది.

## వ, ఒ లు ఎక్కడ నుంచి పలక బడుతాయి, వాటి మధ్య తేడా :

వకారస్య దంత్యోష్ఠమ్ అని సూత్రం. అంటే పై దంతాలతో క్రింది పెదవిని స్పర్శించి శబ్దోచ్చరణ ప్రయోగం చేస్తే వచ్చేది "వ".

ఒదౌతోః కంఠోష్ఠం అని సూత్రం.
పెదవిని గుండ్రంగా విచ్చినట్లు చేసి గొంతునుంచి గాలిని శబ్ద ప్రయోగానికి ఉపయోగిస్తే బహిర్గతమయ్యేవి "ఓ" గానీ హ్రస్వమైన "ఒ" గానీ మరియు"ఔ" శబ్దాలు.

## హ, అః (విసర్గ) లు ఎలా పలక బడుతాయి, వాటి మధ్య తేడా :

విసర్గ అంటె విసర్జించడం. ఇక్కడ గాలిని గట్టిగా విసర్జిస్తే విసర్గ ఉచ్చరించబడుతుంది. కానీ హ లో హ్ 1/2 మాత్ర కానీ కేవల విసర్గ 1/4 మాత్ర మాత్రమే, కానీ అకారంతో కలిపినపుడుకూడా 1/2 మాత్రలోపలే పలకాలి. హ కారానికి 1 మాత్ర సమయం తీసుకోవచ్చు.

## థ ఎందుకు తప్పుగా పలుకబడుతుంది? ఎలా పలకవచ్చు:

తెలుగు వారు థ ను ఎందుకు ధ వలే పలుకుతారో కారణం చెబుతాను. లిపి తో చిన్న సమస్య ఇది. తెలుగు లిపి లో థ ధ ఒకే లా కంటికి కనిపిస్తాయి. కనుక అందరూ థ ని ధ గా ఉచ్చరిస్తారు. కానీ థ పలికేటపుడు, త ని మహాప్రాణంగా పలకాలి.

## ఫ , ఫ్ఘ లు ఎక్కడ నుంచి పలక బడుతాయి, వాటి మధ్య తేడా :

ఫ బదులు ఫార్సీ 'ఫ్జ' పొరపాటుగా పలుకుతుంటాము. అవి రెండు విభిన్నమైనవి.

ఫ అనేది రెండు పెదవులు కలిపి పలకాలి, రెండు పెదాలూ బయటకు పగిలినట్లు విచ్చింపచేస్తే 'ఫ' వస్తుంది.

ఫలం అన్నపుడు దంతాలు వాడకుండా కేవలం పెదాలతో మాత్రమే'ఫ' అనాలి. (ఓష్ఠ్యమ్).

అదే పెదిమ కు దంతాల వరుస తాకించి గాలి బయటకు వదిలితే ఫ़ వస్తుంది. అంతే ఇది 'వ' వలే దంత్యోష్ఠమ్ అన్నమాట.

ఫ़ాతిమా అన్నపుడు పర్షియన్ 'ఫ़' వాడాలి. (దంత్యోష్ఠమ్ )

## శ ష స ల మధ్య తేడా గ్రహించడం చాల సులభం:

సంగీతం లో 'స' తో మొదలు పెడుదాం. స్ స్ స్ స్ అని ఉచరించితే స దంతాల మధ్యనుంచి గాలి వదిలితే వస్తుందని తెలుస్తుంది. కనుకనే దీన్నిసంస్కృతంలో సీత్కారము అంటారు.ఇక్కడ దంతాలు ఉపయోగించాము కనుక "స" ని దంత్యము అన్నారు.

ఇక ఆ 'స్' ని పళ్ళ మధ్యనించి కాక ఎడమ లేదా కుడి బుగ్గల నుంచి బయటకు వదలండి. "శ" శబ్దము ఉచ్చరించబడుతుంది. ఇక్కడ దవడలు లేదా తాలువులు ఉపయోగించాము కనుక "శ" ని తాలవ్యము అన్నారు.

ఇక ఆ 'స్' ని ఉచ్చరిస్తూ, నాలుకను పైకి మడవండి. "ష" శబ్దము ఉచ్చరించబడుతుంది. ఇక్కడ నాలుక నోటి ఉపరితలపు పై భాగము (మూర్ధన్యము) తగులగా "ష" ఏర్పడినది కనుక "ష" ని మూర్ధన్యము అన్నారు.

**" క్ష"**
క్, ష్, అ అనే శబ్దాలను విడి విడిగ అని తర్వాత వేగంగా అనండి. "క్ష" ఎలా ఏర్పడిందో తెలుస్తుంది.

## ఒకేలా కనిపించే అక్షరముల లిపి గుర్తులు - జ, జ:

ధ థ ల వలే , అక్షరలిపి గుర్తులు ఒకేలా ఉండటం వలన మనం జ, జ లను ఉపయోగించడంలో పొరబాట్లు సహజమే. ఉదాహరణకు ప్రఙ్ఞ బదులుగా ప్రజ్ఞ అని , కృతఙ్ఞత బదులుగా కృతజ్ఞత ..మొదలైనవి కొన్ని ఉదాహరణలు.

# అనుబంధం 4

# అక్షర పద్మము




# అక్షరాలు
# ఆత్మ వికాసము

# అక్షర పద్మము

నేను వాక్కు యొక్క నాలుగు అంశాలను పరిశోధించి పరిశీలించిన తర్వాత, మన అక్షరముల స్వరూపాన్ని దర్శించి ఆవిష్కరించుకొని ఆ వైజ్ఞానికతను సత్యాలను అక్షర పద్మం అనే నమూనా రూపంలో నిర్మించడమైనది. అక్షరాల్లో గుంపులు, వాటి పూర్తి స్వరూపాన్ని వాటికి కారణమైన సూక్ష్మమైన అంశాలకు సంబంధించిన సైన్సే ఈ అక్షర పద్మము.




మొదటగా అక్షరాలకి మానసిక వికాసానికి ఉన్న సంబంధాన్ని, వాక్కు యొక్క నాలుగు అంశాలను చర్చిద్దాం.

## అక్షరాలు - మానసిక వికాసము

వాక్కు కి శ్వాసకు అవినాభావ సంబంధం ఉంది. ఇక శ్వాసకు మనస్సు లోని ఆలోచన వేగానికి లేదా ఏకాగ్రతకూ దగ్గర సంబంధం ఉన్నది.

మనస్సు లోని ఆలోచన వేగం తగ్గి ఏకాగ్రత పెరిగే కొలదీ మనస్సు ప్రశాంతతమవుతూ వస్తుంది.

వీటి అన్నిటి మధ్య ఉన్న సూక్ష్మ సంబంధం తెలుసుకొని ప్రశాంత జీవనం గడుపుతూ జీవించగలగడమే మానసిక వికాసం; దాని పరిణామమే ఆధ్యాత్మికత.

అతి ముఖ్యమైన విషయం.. మతం వేరు ఆధ్యాత్మికత వేరు అని ఇక్కడ చదువరులు గమనించగలరు.

అక్షరోద్యమ ముఖ్యమైన మరో లక్ష్యం అక్షరాలను వాటి లో సైన్సును అర్థం చేసుకొంటే మానవులకు ప్రత్యేకమైన ఏకాగ్రత మరియు

సూక్ష్మమైన అంశాలు గ్రహించే మానసిక శక్తి యొక్క మోతాదు పెంచుకోవచ్చని భరోసా ఇవ్వడం కూడా.

భారతీయ ఋషులు భారతీయ శబ్ద శాస్త్రము ద్వారా అక్షరాలు మరియు అతి చిన్న శబ్ద విభాగాలైన వర్ణాలపైన , వాటి కాల ప్రమాణమైన మాత్ర పైన , అవి ఒక దానితో ఒకటి కలుపబడటానికి సంధి నియమాలను సృష్టించి మనిషికి అద్భుతమైన ఉపకారం చేసారు. ఇంకా సూక్ష్మ విషయాలైన స్వరము (వైదిక మరియు సంగీత స్వరాలు) మొదలైన వాటిని చర్చించారు.

ముఖ్యంగా అతి సూక్ష్మ శబ్ద విభాగాలకు మరియు వాటితో శ్వాసకు కంపనలకి ఉన్న సంబంధం నిరూపించబడింది.
అతి తక్కువ పరిమాణంలోని సూక్ష్మ కంపనల స్థాయి కి మనిషి ఏకాగ్రత కి మధ్య అనుబంధం ఉన్నదనీ, అదే ధారణ కు **మూలమనీ** విజ్ఞాన భైరవం, నందికేశ కాశిక వంటి యోగ తంత్ర గ్రంథాలు చర్చించడం జరిగింది.

ఉదాహరణ కు-

శబ్ద స్పర్శౌ రూప రస గంధాశ్చ ఞమఙణన నాం |
వ్యోమాదీనామ్ గుణాహ్యేతే జానీయాత్ సర్వ వస్తుషు || నంది.కాశిక.శ్లో. 18

నంది.కాశిక.శ్లో. 18 భావము :

శబ్దము (వినికిడి), స్పర్శ (తాకటము) , రూపము (ఆకారము, చూపు), రసము(రుచి), గంధము(వాసన) అనే అయిది తన్మాత్రలకు ఞమఙణన లు సంకేతాలు. ఈ తన్మాత్రలు అన్ని వస్తువులలో పంచ భూతములైన ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథ్వీ తత్వములకు గుణములుగా ఉన్నవని తెలియవలెను

## వాక్కు యొక్క నాలుగు అంశాలు

మనిషికి వాక్కు ప్రత్యేకం.

మనిషి నోటి తో పలక గలిగే (క్రియ), మనిషి వినగలిగే మాటకి / **వైఖరీ** రూపంలోని వాక్కు కి ప్రతిరూపం.

వినిపించే వాక్కు/మాట కి మూలమైన భావమునకు- భావాన్ని వ్యక్తీకరించాలనే కోరికకు మధ్య (జ్ఞాన) స్థితి **మధ్యమ** వాక్కు .

భావాన్ని వ్యక్తీకరించాలనే కోరిక (ఇచ్చ ) ని **పశ్యంతీ** వాక్కు కి ప్రతి రూపంగా చెప్పుకోవచ్చు.

వ్యక్తీకరించాలనే కోరికకి మూలమైనప్రాణం లేదా మూల చైతన్యం **పరా వాక్కు**.

**వైఖరీ స్థాయి** లోని వాక్కు కి పరా స్థాయి లోని మూల చైతన్యానికి ఉన్న అవినాభావ సంబంధ వివరించేదే అక్షర పద్మము



# అక్షరాలు, ఓంకారము - అతి వాగుడికి మహా మౌనానికి మధ్య సరిహద్దు :

కవిత్వం/అతి వాగుడు నుంచి మహా మౌనం వరకు గల వివిధ స్థాయిలను చర్చిస్తూ, అక్షరాలు ముఖ్యంగా ప్రణవంగా చెప్పబడే "ఓం" ఈ రెంటికీ మధ్య వారధి లేదా కేంద్ర బిందువు అని మన శబ్ద శాస్త్రాలు నిరూపించి చూపించాయి.

అంతే కాక అక్షరాలను నిజ జీవితంలో నిత్యజీవితంలో ఆచరణ యోగ్యంగా నిర్మించి, ప్రతి భారతీయునికి మానసిక వికాసమును అనేది అందుబాటులోకి తెచ్చిన ఘనత భారతీయ శబ్ద వేత్తలదే.

"ఓం" లోని అ, ఉ, మ్(ం) లలో కంఠం నుంచి ఉత్పత్తి అయ్యే "అ" నుంచి వినిపించేటువంటి వివిధ వర్ణాలు,అక్షరాలు వివిధ ప్రయత్నాల ఆధారంగా పుడుతాయి.

తర్వాత అ నుంచి మ్(ం) కు ప్రయాణం, వినిపిఛే శబ్దాల నుండి, అతి సూక్ష్మ శబ్దాల వైపుకు ప్రయాణం.

**చివరిదైన మ్ (ం) )** శబ్దము వద్ద పూర్తిగా నోరు మూయబడుతుంది. ఈ మ్ అన్ని శబ్దాలకూ ఆధారమైన నాదానికి ప్రతీక. దీన్నే అనుస్వారం అం అని అచ్చులలొ నేర్చుకుంటాము.
**మ్ (ం)** శబ్దము నాదముగా తరువాత నోటిలోనుంచి కనీసం అర్ధ మాత్ర కలిగిన వర్ణముగా బహిర్గతమవాలంటే, దానికి ప్రాణ వాయువు అనే ఇంధనమవసరము.
ఆ ఇంధనము ఊతగా చేసుకొని మానవుడు జనింప చేసే శబ్దాలు సృష్టిలో జీవరాసుల వలే అనేకమైనవి, వైవిధ్యమైనవి.
ఇక
చివరిగా ఈ ప్రాణానికి శ్వాసకు హ్ వర్ణము సంకేతం. 'హ్' విసర్గ కు ప్రతిరూపంగా కూడా మనము భావించవచ్చు. దీన్నే విసర్గ అః అని అచ్చులలొ నేర్చుకుంటాము

శబ్దోత్పత్తి అంశము పైన మరియు శబ్దము యొక్క తత్వములపైన మన సంగీత గ్రంథములు, తంత్ర గ్రంథములు, వేదాంగ శిక్షా, ప్రాతిశాఖ్య గ్రంథములు కూలంకషముగా చర్చించడము జరిగినది.

"సంవృతే కోష్ఠే నాదః క్రియతే " అని తైత్తిరీయ ప్రాతిశాఖ్య (2.4 సూత్రం ) చెబుతుంది. అనగా గొంతుక మూసి ప్రాణ వాయు సంచారమునకు ప్రయత్నిస్తే అది "నాదం" అనబడుతుంది. అనునాసికము గా చేసే మ కారము దీని దగ్గరి అవతారము. అనుస్వారము (అం) నాదమునకు సరియైన సంజ్ఞ.

తైత్తిరీయ ప్రాతిశాఖ్య (2.5 సూత్రం) "వివృతే శ్వాసః" అనగా గొంతుక తెరిచి ప్రాణ వాయు సంచారమునకు ప్రయత్నిస్తే అది "శ్వాస" అనబడుతుంది. అ కారమునకు ఇలాంటి ప్రయత్నమే మూలము.

తైత్తిరీయ ప్రాతిశాఖ్య (2.6 సూత్రం) "మధ్యే హ కారః" అనగా గొంతుక తెరిచీ తరవనట్లు ఉంచి ప్రాణ వాయు సంచారమునకు ప్రయత్నిస్తే అది "హ" కారమును ఉత్పత్తి చేస్తుంది. ఊష్మలు అన్నింటికీ (శ, ష, స) హ కారమే మూలము. ఈ హ్ వర్ణమునకు మూలము విసర్గ.

కనుక ఇక్కడ మనము గమనించ వలసినది శబ్ద సృష్టికి "అ" కారము, అనుస్వారం (అం), విసర్గ (అః) అత్యంత ఉపయుక్తములు. ఈ మూడింటిని కలిపితే వచ్చే స్థూల రూపమే "అహం".

ప్రణవములోని అ_ఉ_మ(ం) లు క్రమంగా విస్తరించి అకచటతపయశ లు గా శబ్ద ఉత్పత్తి స్థానాలను విభజించుకొని అవి విస్తరించి మనిషి పలుకగలిగే అన్ని అక్షరములూ శబ్దాలూ ఏర్పడ్డాయి. ఆ పైన పదాలు, వాక్యాలు, వాక్ప్రవాహాలు ఏర్పడతాయి. దేహమే నేనన్కునే స్థితి. ఇది స్థూల విభాగము.

**కవిత్వం/అతి వాగుడు నుంచి మహా మౌనం వరకు గల వివిధ స్థాయిలను , అక్షరాలు ముఖ్యంగా అక్షరాల సుక్ష్మ రూపమైన "ఓం" ఈ రెంటికీ మధ్య వారధి లేదా కేంద్ర బిందువు ఎలా అయిందో, నేను క్రింద ఇచ్చిన నమూనా చూస్తే మీకే తెలుస్తుంది.**

## వాక్కు స్థూల విభాగము.

12. నియమాలు లేకుండా మేధస్సుకి కష్టం కలిగించకుండా అలంకారం మీద శ్రద్ధ పెట్టకుండా భావ వ్యక్తీకరణ కు ఉఉపయోగపడేవి మన నిత్య జీవితంలోని సాధారణంగా గమనించే వాక్ప్రవాహాలు అత్యంత స్థూల విభాగం.

11. అతి తక్కువ పరిమితితో వాడిన వాక్యాలలో మాత్రా వర్ణ నియమాలతో అలంకారయుక్తంగా స్వరయుక్తంగా చెప్పేవి పాటలు,శ్లోకాలు, పద్యాలు, ఋక్కులు కానటువంటి వైదిక సాహిత్యం
10. అతి తక్కువ పరిమితితో వాడిన వాక్యాలలో ఎక్కువ అర్థం చెప్పేవి సూత్రాలు , ఋక్కులు

9. సమాసాల పై స్థాయిలో పనిని వివరించడానికి వాడే క్రియలతో లేదా/మరియు వర్ణించి వివరించాలనుకొన్నపుడు అవసరమయ్యే విశేషణాల కలగలుపుగా ఏర్పడిన వాక్యాలు

8. పదకోశాల మధ్య వ్యాకరణ పరమైన ఒప్పందాలతో పుట్టే సమాసాలు

7. అర్థమును ప్రకటించే పదాలు , పద కోశాలు

6. అర్థమును ప్రకటించే పదాలకు మూలమైన ధాతువులు మరియు బీజ మంత్రాలు.

5. ఆపైన శబ్ద ఉత్పత్తి స్థానాలను విభజించుకొని విస్తరించుకొని నాలుక ఆధారంగా మనిషి పలుకగలిగే అన్ని అక్షరములూ శబ్దాలు

4. ప్రణవములోని అ_ఉ_మ లు క్రమంగా విస్తరించి అకచటతపయశ లు గా శబ్ద ఉత్పత్తి స్థానాల విభజన యొక్క స్పృహ

3. ప్రణవము లోని మొదటిదైన అ కారము- (కంపన శక్తి 1 మాత్ర) పూర్తిగా తెరచిన నోరు మరియు కంఠంనుంచి 'అ' కారం.

2. ప్రణవము లోని మధ్యదైన ఉ కారము- (కంపన శక్తి 1 మాత్ర) సగం తెరచిన నోరు మరియు గుండ్రంగా ఉంచిన పెదవులు
1. ప్రణవము లోని చివరిదైన మ కారము (కంపన శక్తి 1 మాత్ర) ముక్కు చివర/అనునాసికం మరియు పూర్తి గా మూయబడిన నోరు

ఈ విభాగమునకు చెందిన మరిన్ని అంశముల కొరకు అనుబంధములో ఇచ్చిన "అక్షర విజ్ఞానము" , "అక్షర అభ్యాసములు" అనే అంశాలు చదవండి.

## ఇక వాక్కు సూక్ష్మ విభాగము:

ఈ ప్రణవ నాదము లోకి లోతు లోతు గా వెళితే 12 కళలు కలిగి 12 వ చివర అనగా ద్వాదశాంతము వరకూ వివిధ స్థాయిలు చెప్పబడ్డాయి.

1. ప్రణవము లోని చివరిదైన మ కారము (కంపన శక్తి 1 మాత్ర) ముక్కు చివర/అనునాసికం మరియు పూర్తి గా మూయబడిన నోరు

2. బిందువు లేదా అనుస్వారము (కంపన శక్తి 1/2 మాత్ర) – బొట్టు

3. అర్ధానుస్వారము - (కంపన శక్తి 1/4 మాత్ర) అర్ధ చంద్రాకారం

4. నిరోధిని - (కంపన శక్తి 1/8 మాత్ర ) నుదురు పైన అడ్డ గీత

5. నాదం - (కంపన శక్తి 1/16 మాత్ర) తల నుండి సుషుమ్న వరకు

6. నాదాంతము - (కంపన శక్తి 1/32 మాత్ర) బ్రహ్మ రంధ్రము - దేహ భావనా రాహిత్యం

7. శక్తి - (కంపన శక్తి 1/64 మాత్ర) చర్మమంతా - ఆనంద స్థితి

8. వ్యాపినీ/క - (కంపన శక్తి 1/128 మాత్ర) శిఖ - విశ్వ రూప భావన

9. సమనా - (కంపన శక్తి 1/256 మాత్ర) - శుద్ధ జ్ఞాన బోధ స్వరూపము - కాలమునకు లోబడినది- సిద్ధత్వం

10. ఉన్మనా/నీ - (కంపన శక్తి 1/512 మాత్ర, ) ధ్యాన ధాతృ ధ్యేయాలు లేని మనోన్మనీ స్థితి - , అకాల స్థితి

11. మహా బిందు - (కంపన శక్తి అమాత్రకము ) అమనస్కము- పంచ కృత్య స్థితి

12. షోడశి/భైరవ స్థితి - బ్రహ్మ కళా స్థితి , మహా శూన్యం, భైరవ స్థితి

## అక్షర పద్మము -ఆవరణలు




సంకల్పము వాక్కుగా అభివ్యక్తీకరించబడే పరిణామం నాలుగు భాగాలుగా విభజించబడింది.

అవే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ.

పైన స్థూల విభాగములోని 5 నుంచి, 12 వరకూ ఉన్న అంశాలు "వైఖరీ" స్థాయికి చెందినవి.

పైన స్థూల విభాగములోని 1,2,3,4, అంశాలు "మధ్యమా" స్థాయికి చెందినవి.

పైన సూక్ష్మ విభాగములోని మొదటి 10 అంశాలు "పశ్యంతీ" స్థాయికి చెందినవి.

పైన సూక్ష్మ విభాగములోని 11, 12 వ అంశాలు "పరా" స్థాయికి చెందినవి.

వాక్కు యొక్క నాలుగు అంశాల నమూనానే అక్షర పద్మము.

అక్షర పద్మము లో నాలుగు ఆవరణలు ఉన్నాయి.

మొదటి ఆవరణ -అష్ట దళ పద్మాకృతి- వైఖరీ వాక్కు కి ప్రతీక - క్రియా శక్తి
రెండవ ఆవరణ- త్రికోణాకృతి - మధ్యమా వాక్కు కి ప్రతీక -జ్ఞాన శక్తి
మూడవ ఆవరణ - వృత్తము - పశ్యంతీ వాక్కు కి ప్రతీక -ఇచ్చా శక్తి
నాల్గవ ఆవరణ - బిందువు - పరా వాక్కు కి ప్రతీక

ప్రాచీన వైదిక శిక్ష మరియు తంత్ర శాస్త్రాలలో **అ క చ ట త ప య శ** ల వర్ణన ఉన్నది. ఇది మనిషి నోటి తో పలక గలిగే (క్రియ), మనిషి వినగలిగే మాటకి / **వైఖరీ** రూపంలోని వాక్కు కి ప్రతిరూపం.

దాని మధ్యలో ఉన్న **అ, ఉ , మ్** ల కలయిక ఓమ్ లేదా ప్రణవం **మధ్యమ** వాక్కు కు ప్రతిరూపం. ఇది వినిపించే వాక్కు/మాట కి మూలమైన భావమునకు- భావాన్ని వ్యక్తీకరించాలనే కోరికకు మధ్య (జ్ఞాన) స్థితి.

భావాన్ని వ్యక్తీకరించాలనే కోరిక (ఇచ్ఛ ) మధ్యలోని వృత్తము లో నిబిడీకృతమై ఉంటాయి. దీన్ని **పశ్యంతీ** వాక్కు కి ప్రతి రూపంగా చెప్పుకోవచ్చు.

వ్యక్తీకరించాలనే కోరికకి మూలమైన ప్రాణాన్ని **పరా వాక్కు** గా చెబుతూ వృత్తము మధ్య లోని బిందువు గా అక్షర పద్మం లో చూపబడినది.

## మొదటి ఆవరణ -అష్ట దళ పద్మాకృతి:

మీరు చిత్రం లో గీయబడిన అక్షర పద్మాన్ని గమనిస్తే, అ క చ ట త ప య శ అనే అక్షరములు పద్మపు రేకులలో కనిపిస్తాయి. ఇవి మరేమిటో కాదు, మన అక్షర మాలలని అక్షరపు గుంపులు లేదా సమూహాలకు చెందిన మొదటి అక్షరములు.



సముహము 1- అ నుంచి అః వరకు
సముహము 2- క నుంచి ఙ వరకు
సముహము 3- చ నుంచి ఞ వరకు
సముహము 4- ట నుంచి ణ వరకు
సముహము 5- త నుంచి న వరకు
సముహము 6- ప నుంచి మ వరకు
సముహము 7- య నుంచి వ వరకు
సముహము 8- శ నుంచి క్ష వరకు

మనము సాధారణంగా "అ - క చ ట త ప- య- శ" అనబడే వరుసలో అక్షరములు వ్రాస్తాము. అనగా మొదట, అ నుండి అః వరకు అచ్చులు, తర్వాత క, చ , ట, త, ప వర్గాలు వ్రాసి ; ఆపై "య ర ల వ" వర్గము, చివరిగా "శ ష స హ" వర్గము తో ముగిస్తాము.

ఈ అమరిక లో అద్భుతమైన ఆలోచన మరియు విజ్ఞానము ఉంది. ఇవి "అభ్యంతర ప్రయత్నము" అనే విధానము ద్వారా వర్గీకరించబడ్డాయి. ఈ విధానమునకు మూలము కరణము(కదిలే ఉపకరణ), స్థానము(కదలని ఉపకరణ) ఆధారముగా చేసుకుని జరిగే "అభ్యంతర ప్రయత్నము".

ఈ కరణము స్థానము ఒక దాన్ని ఒకటి స్పర్శించబడుతున్నవా లేదా, ఎంత దూరములో ఒక దానికొకటి ఉన్నవి అనే దాని ఆధారముగా ఈ కూర్పు జరిగినది. ఉదాహరణకు "త థ ద ధ న" ఉచ్చరించునపుడు దంతాలు "స్థానము", నాలుక "కరణము" ." ప ఫ బ భ మ"ఉచ్చరించునపుడు పై పెదవి "స్థానము", క్రింది పెదవి "కరణము" . ఇవి ఒక దాన్ని ఒకటి స్పృశించుకొంటాయి. కనుక స్పర్శలు అన్నారు. క, చ, ట, త , ప వర్గులన్నీ స్పర్శలు. అలాగే "యరలవ" లు అంతస్థములు "శ ష స హ" లు ఊష్మలు.

అచః స్వరాః (అచ్ ప్రత్యాహారము )
అం అః ఇత్యచాః ( అం అః అచ్చులు)
కాదయోమావసానాః స్పర్శాః (క నుంచి మ వరకు)
యణోఽఅంతస్థాః (యణ్ ప్రత్యాహారము - య నుంచి వ వరకు)
శల్ ఊష్మాణః (శల్ ప్రత్యాహారము - శ నుంచి హ వరకు)

అభ్యంతర ప్రయత్నం మొదలైన సాంకేతిక పదాలు విషయాలు నేను ముందు భాగాల్లో నిర్వచిస్తాను. వివరిస్తాను.

ఈ సమూహాలే కాక, ఆ సమూహాల్లో ఉన్న ప్రతి అక్షరము కూర్పు లో కూడా పెద్ద సైన్సే ఉంది. అంటే క తర్వాత గ తర్వాత జ ఉండటం వెనకల ఒక సైన్సు సైన్సు ఉందన్నమాట. అలాగే వీటి క ప్రక్క ఖ, గ ప్రక్క ఘ కి కూడా ఒక విశ్లేషణ ఉంది.

## రెండవ ఆవరణ- త్రికోణాకృతి

అలాగే పద్మములోని త్రికోణాకారము లో మూడు అచ్చులు అ, ఉ, అనుస్వారం (అం , ం) లు ఇవ్వబడ్డాయి. ఇవి నాలుక ఉపయోగించకుండా, మూగ వాడు లేదా మాటలు రాని పిల్లలు కూడా పలక గలిగే శబ్దాలు. అందువల్లేనేమో ఆ అని, అమ్మ అనీ, మ్మ అని, ఊ అని "ఊ" కొట్టే పిల్లవాడు కూడా పలకగలడు. అందువల్లే అమ్మ ని ఏమీరాని పిల్లవాడు కూడా పిలవగలిగేలా అమ్మ అని పేరు పెట్టుకున్నాము.




అతి ముఖ్యంగా, శబ్ద ఉత్పత్తిని గమనిస్తే, ముఖ్యమైన ఈ మూడు అచ్చులు మన నోటిలోని ప్రాంతాల నుంచీ పలకగలిగే శబ్దాలకు హద్దుల వంటివి. ఒక రకంగా ఈ ఆ ఊ మ్ అనేవి మొతం అక్షర మాల కి మూల రూపాలు. వీటిని కలిపినపుడు, గుణ సంధి ఏర్పడి ఓమ్ అనే శబ్దము ఏర్పడుతుంది. అందు వలననే సాధారణంగా ఓమ్ ని అన్ని శబ్దాల యొక్క సంకీర్ణ శబ్దం గా పరిగణిస్తారు.
ఓమ్ ని మతంగా పరిగణించి శబ్ద శాస్త్రం చదవడం మానవద్దని మనవి.
మనం ఇక్కడ మతము కాక, కేవలం భాష, శబ్ద శాస్త్రంలోని సైన్సుని చర్చిస్తున్నాము భావజాలం, సామాజిక పక్షపాత ధోరణులవలననే మాతృ భాషల హానికి ఆస్కారమెక్కువని తేలిన అంశము..

## మూడవ నాల్గవ ఆవరణలు- వృత్తము- బిందువు:

భావాన్ని వ్యక్తీకరించాలనే కోరిక (ఇచ్ఛ ) మధ్యలోని వృత్తము లో నిబిడీకృతమై ఉంటాయి. దీన్ని **పశ్యంతీ** వాక్కు కి ప్రతి రూపంగా చెప్పుకోవచ్చు.

వ్యక్తీకరించాలనే కోరికకి మూలమైన ప్రాణాన్ని **పరా వాక్కు** గా చెబుతూ వృత్తము మధ్య లోని బిందువు గా అక్షర పద్మం లో చూపబడినది.



**వృత్తము- బిందువులు** వాక్కు యొక్క సూక్ష్మ విభాగమునకు ప్రతీకలు. సూక్ష్మ విభాగము ప్రణవ నాదము నుంచీ ద్వాదశాంతము వరకూ వివిధ స్థాయిలు.

సూక్ష్మ విభాగములోని మొదటి 10 అంశాలు "పశ్యంతీ" స్థాయికి చెందినవి.

సూక్ష్మ విభాగములోని 11, 12 వ అంశాలు "పరా" స్థాయికి చెందినవి.

ప్రణవ నాదము లోకి లోతు లోతు గా వెళితే 12 కళలు కలిగి 12 వ చివర అనగా ద్వాదశాంతము వరకూ వివిధ స్థాయిలు చెప్పబడ్డాయి.

1. 1 ప్రణవము లోని చివరిదైన మ కారము (కంపన శక్తి 1 మాత్ర) ముక్కు చివర/అనునాసికం మరియు పూర్తి గా మూయబడిన నోరు

2. బిందువు లేదా అనుస్వారము (కంపన శక్తి 1/2 మాత్ర) – బొట్టు

3. అర్ధానుస్వారము - (కంపన శక్తి 1/4 మాత్ర) అర్ధ చంద్రాకారం

4. నిరోధిని - (కంపన శక్తి 1/8 మాత్ర ) నుదురు పైన అడ్డ గీత

5. నాదం - (కంపన శక్తి 1/16 మాత్ర) తల నుండి సుషుమ్న వరకు

6. నాదాంతము - (కంపన శక్తి 1/32 మాత్ర) బ్రహ్మ రంధ్రము - దేహ భావనా రాహిత్యం

7. శక్తి - (కంపన శక్తి 1/64 మాత్ర) చర్మమంతా - ఆనంద స్థితి

8. వ్యాపినీ/క - (కంపన శక్తి 1/128 మాత్ర) శిఖ - విశ్వ రూప భావన

9. సమనా - (కంపన శక్తి 1/256 మాత్ర) - శుద్ధ జ్ఞాన బోధ స్వరూపము - కాలమునకు లోబడినది- సిద్ధత్వం

10. ఉన్మనా/నీ - (కంపన శక్తి 1/512 మాత్ర, ) ధ్యాన ధాతృ ధ్యేయాలు లేని మనోన్మనీ స్థితి - , అకాల స్థితి

11. మహా బిందు - (కంపన శక్తి అమాత్రకము ) అమనస్కము- పంచ కృత్య స్థితి

12. షోడశి/భైరవ స్థితి - బ్రహ్మ కళా స్థితి , మహా శూన్యం, భైరవ స్థితి





# అక్షరోద్యమం



నా అక్షరోద్యమం, అక్షరాల్లోని వైజ్ఞానిక సత్యాలు ప్రజలకు పంచడమే. వారికి మన అక్షరాల వెనుక విజ్ఞాన రహస్యాలను నేర్చుకున్న తర్వాత ఆత్మ విశ్వాసము, ఆత్మ గౌరవమూ, కలగటము తథ్యము.

ప్రపంచము మొత్తము మీద, కేవలం "అక్షర పద్ధతి/ అక్షర వ్యవస్థ" మాత్రమే శబ్దము మరియు శబ్ద ఉత్పత్తి స్థానముల మధ్య సంబంధమును బట్టి వైజ్ఞానికంగా ఏర్పడిన పద్ధతి.

సాధారణంగా, అక్షరములంటే పిల్లలకు నేర్పే ఒక చిన్నపాటి విషయమనీ , మనం ఇంతకు మునుపే నేర్చేసుకొన్నదనే ఒక అభిప్రాయంలో సాధారణంగా ఉంటాము. కానీ వాస్తవానికి, ఎక్కువ శాతం తెలుగు మాతృ భాష గా గల వారికి, మన అక్షరాల వెనుక సైన్సు/విజ్ఞాన రహస్యాల గురించి అవగాహన లేదనే విషయం కాస్త ఆందోళన కలిగించే అంశమే. ఉదాహరణకి, మన అక్షరములలో క, చ, ట, త, ప అని వరుసల ఎందుకు ఏర్పరిచారు? క తర్వాత ఖ, తర్వాత గ తర్వాత ఘ ఎందుకు? క, ఖ, గ , ఘ, ఙ వరుసలో చివర వచ్చే ఙ ఎలా పలకాలి? చే , జే పైన త వత్తు ఎందుకు కల్పించారు? మొదలైన ప్రశ్నలకు చాల కొద్ది మంది వద్దే వైజ్ఞానికమైన జవాబు లభిస్తుంది.

ప్రస్తుతము, తెలుగు అక్షరములను వాటి వెనుక రహస్యాలను వివరించకుండా, ప్రయోగాత్మకమైన అభ్యాసాలు లేకుండా, ఒక లిపి లాగా బాగా రుబ్బించి, నేర్పించడమే దీనికి కారణం. అక్షరాల వెనుక విజ్ఞానం, ముఖ్యంగా అక్షర రహస్యాలు తెలిపే మన ప్రాచీన శబ్ద సూత్రాలను, మన తెలుగు పాఠ్య ప్రణాళికలు విస్మరించడం వలన అక్షరాః కూర్పు లో ఉన్న సైన్సు మనకు తెలియదు.

దాన్ని పరిష్కరించే దిశ గా, అక్షరముల కూర్పులోని రహస్యాలు ప్రతి ఒక్క తెలుగు వాడికి చేరాలనే శాంతియుతమైన సంకల్పంతో ప్రపంచ వ్యాప్తంగా నేను అక్షరోద్యమానికి శ్రీకారం చుట్టడం జరిగినది. మన అక్షరాల కూర్పు వెనుక ఉన్న సైన్సును అందరికీ పంచాలనుకొనే నా అక్షరోద్యమానికి, మీరు తోడ్పాటు ఇవ్వాలని నా విన్నపము.

\- అక్షరం ఉమామహేశ్

